అవిఘ్నమస్తు.

శుభమస్తు.

# బద్దినీతులు.



## రాజనీతిప్రకరణము.



శ్రీరామారమణీయు ను
మారామారమణు వాగ్రమాహృదయేశుఁ
గోరి మురారిఁ బురారి న
ఘారి హృషీకేశు నీశు నజుఁ గొల్తు మదిన్. 1

క. రాజవరమకుటమణిగణ
పూజితపదయుగుఁడ హేమభూభృద్ధైర్య
భ్రాజితుఁడ బద్దనాఖ్యుఁడ
రాజోచితనీతు లొప్ప రచియింతుఁ దగన్. 2

చ. నయమునఁ గాని భూమిప్రజ నమ్మదు, నమ్మనఁ గాని యర్థసం
చయమును దంత్రవృద్ధియును సాగదు, సాగినఁగాని శత్రులన్
బయికొని యోర్వరాదు, రిపుపక్షమణంగినఁ గాని భూమిన
క్షయముగ నేలరా దనిరి కార్యచతుర్ముఖ బద్దిభూపతీ! 3

క. న్యాయము ప్రజపెక్కువకు ను
పాయము, ప్రజకల్మి సిరి కుపాయం బగుటన్
న్యాయమె భండారము నర
నాయకులకు నండ్రు కీర్తినారాయణుఁడా!

క. మేదిని కనురాగము సం
పాదించి కృతార్థుఁ డైనపతికిని విషయా
స్వాదన భూషణ మగునప
వాదము పరపతి కుదారవైరోచనుఁడా!

క. పత్ని ధరిత్రియ పురుషులె
రత్నము లెప్పుడును; పురంధ్రిరత్నములు శిరో
రత్నము లవనీపతులకుఁ
బత్నులె? రత్నములె? పరగ బద్దనరేంద్రా!

క. ప్రజఁ దల్లి వెంచువిధమునఁ
బ్రజలం బతి వెంచు నదియె, పదపడి తల్లిన్
బ్రజప్రోవు సందియము, పతి
ప్రజప్రోవ పడి నిక్కువంబు బద్దినరేంద్రా.

క. నమ్మ ప్రజ మూఁగు బొంకమి
నమ్మకమును సాక్షి గాఁగ నరపతి వనవా
కిమ్మయి నడపుచు లోకము
నమ్మింపఁగవలయుఁ గీర్తినారాయణుఁడా!

చ. గనులు కృషిప్రపంచ మరికప్పము సుంకము గోకులంబు నం
దనవనముల్ జలస్థలపథిస్థవణిక్క్రియ దుర్గరక్షణం
బనఁగలయున్నమార్గముల నర్థము రోయక కేవలంబ శా
పున పాలియించు రాజుసిరిపొందునె? రాజమనోజభూభుజా! 9

క. జనపతి తనప్రజభారము
తనముఖమున నడపికొనక తక్కనఁ బొలియుం
డిని చెఱుతు రతనియిల్లును
జనువారును బ్రజ నరేంద్రచతురాననుఁడా. 10

క. అనుజులు తనుజులు గురుజను
లనుఁగులు బంధులు ప్రధాను లని సిరిపాత్రీఁ
జనుఁగాని యాజ్ఞపాత్రీఁ
జన దధిపతికిన్ వివేకచతురాననుఁడా! 11

క. సకలవ్యసనికిఁ జుట్టము
నకు మంత్రికి నిష్టభృత్యునకు నజ్ఞకు నో
జ్ఞకు బోటుకానికర్థా
దికమిచ్చుట చనదు నయగతిన్ బద్ధినృపా! 12

క. సాధింపఁ గడిది శత్రుల
సాధించినఁ బతికి వృథ, నిజక్షితి జనులన్
బాధించుకంటకులఁ బరి
శోధింపనినాఁడు నన్నెచోడనరేంద్రా! 13

క. క్షితిజనులకుఁ బరిజనులకు
సతతముఁ బ్రగ్గడను జూపు చనదు ధరిత్రీ
పతి ప్రగ్గడయై ప్రగ్గడఁ
బ్రతిహస్తునిఁ జేయవలయు బద్దెనరేంద్రా. 14

క. అతిమహిమోన్నతియును సం
పతియును సత్యార్థమార్గభారనిమగ్న
స్థితియును దంత్రము మంత్రికిఁ
బతి యిచ్చుట నీతి గాదు బద్దెనరేంద్రా. 15

క. మానుగ భూపతి యుపశమ
హీనుఁ జెలిం జేసి మంత్ర మెఱిఁగించుట యా
జ్ఞానము పతి పతితునకును
జానన మిచ్చినవిధంబు బద్దెనరేంద్రా. 16

క. వక్రిని బతి యన్యోపా
యక్రియలను జక్కఁజేయునది దానను ని
ర్వక్రంబు కాని తుద దహ
నక్రియ తథ్యంబు కీర్తినారాయణుఁడా. 17

క. క్రూరుఁ బ్రజ విడుచు, నోడఁగ
నేరదు సౌమ్యునకుఁ గాన నృపతి ప్రజను సా
ధారణరూపంబున నను
ధారకుఁడై మెలఁపవలయు బద్దెనరేంద్రా. 18

క. పరశక్తియు నిజశక్తియుఁ
బరికింపక తొడరు టెల్లభంగమునకుఁ బ
ట్టొరులం దన్ను నెఱుంగుట
పరమజ్ఞానంబు పతికి బద్దిన రేఁడా. 1

క. *బలవర్గము సామంతుల
బలమున కగ్గలము గన నృపాలున కొప్పున్
బలిమి, పెరనృపతి కాజ్ఞా
బలసంపద యెంతదన్న బద్దిన రేండా. 2

క. స్ఫురితరుచిరత్నచామీ
కరవీజనధారణములు(1)గా వొప్పనకుం
బరివారము మెయిలక్ష్మియ
నరపతులకుఁ దొడవు కీర్తినారాయణుఁడా. 2

క. స్వాయత్తుఁ డుత్తముండు ప
రాయత్తుం డైన భూతలాధీశునకున్
స్వాయత్తుకన్న మేలుభ
యాయత్తుం డండ్రు దశదిశాభరణాంకా. 2

క. పరికింపనీతిమార్గము,
నరపతులకు నెల్ల బహుజనద్వేషముగా
దొరకొనియెడిలాభంబులు
పరిహారణీయంబు లండ్రు బద్దిన రేండా.

(1) కారణములు. * తలవర్గము.

## బద్దెనీతులు.

ఇది దేశం బిది కాలం
బిది యాయం బిది వ్యయంబు నిది సంపదనా
కిది శక్తి యనువిచారము
వదలమి మతి పతి కుదార వైరోచనుఁడా. 24

పదను దొరకొనుఁడుఁ జెచ్చెర
వదలక వెదవెట్టు హాలికవర్గముకరణిం
బదను దొరకొనుఁడుఁ జెచ్చెర
వదలక కార్యంబుఁ దీర్పవలయుఁ బతికిన్. 25

భూపగుణ మల్గి చెరుపఁగ
నోపుట, కరుణించి మనుపనోపుట, జడుఁడై
కోపప్రసాదగుణములు
చూపనిపతి పతియె? నన్నచోడనరేంద్రా. 26

కోపప్రసాదములలోఁ
గోపము చూపుచుఁ బ్రసాదగుణ మేమెడలన్
జూపనినృపతిం గొలిచిన
పాపమునకు మేర యెద్ది? బద్దినరేంద్రా! 27

తాను దయఁ బెద్దమనిచిన
మానిసిఁ బతి తగినయెడల మన్నింపమి య
జ్ఞానము తనమనుపు గజ
స్నానం బగుమీఁదఁ గీర్తినారాయణుఁడా. 28

చ. నవసినవారి, బ్రిస్తవమునన్ మృతిఁ బొందినవారివారి, నా
హవముఖవీరులం, బనులయందు బ్రగల్భుల, వేరులేనిబాం
ధవుల, వివేకులం బుధులఁ, దప్పనికాపుల భక్తియుక్తులన్
ధ్రువముగఁ బ్రోవలేని నృపతుల్ కుపతుల్ పరవక్షభైరవా

క.*తనకెక్కడనుండియు ద
క్కనిభృత్యుల మనిచి చెరుపఁగావలదు ప్రియో
జనమునకుఁ దగినమేలి
చ్చునది నరేశ్వరుఁడు నన్నెచోడనరేంద్రా. 3

క. మనుపఁ గొఱయేని జీతము
తనియఁగ నిచ్చునది యెంతదయ గలిగియు నే
రనివాని నెఱతనమునకుఁ
జొనుపుట దుర్నయము నన్నెచోడనరేంద్రా. 3

క. దోషములేకయు నలిగెదు
రోషాయత్తునకు నెవ్వరును వెఱతురు ని
ర్దోషస్థితికిఁ బాముస
కీషద్భేదంబుగలదె?(1)యేమిట నైనన్. 3

ఉ. న్యాయముదప్పనానృపతినాఁడు సమస్తముఁ బాసు, నజ్జనుల్
వాయుదు నూరువాడు, కులభామినివాయును నిల్లువాడు, లేఁ
బ్రాయపురూపసంపదలువాయుఁడు దేహమువాడు,ధర్మముల్
వాయుఁడు మూఁడులోకములుఁబాడగు నన్ననగంధవారణా.

---

(1) కీషద్వేషంబుగలదె; ద్వైషమ్యముష్నె. * కెక్కటినుండి.

ఉ. మండలనాథునాజ్ఞకు సమస్తజనంబులు నోడి పాడిమై
నుండక మేరఁదప్పి బలియుం డబలుఁ మననీక పెద్దమీఁ
నొండిక మీను మ్రింగుక్రియఁ గ్రొవ్వునఁ జంపుచునుండెనేనియ
మ్మండల మేల నిల్చుమతిమంతులకుఁ బరపక్షభైరవా. 34

చ. వెరవరిగానివాని కడువేసరుచుండెడువాని, మాటలన్
సరసుఁడుగానివాని, మతిచాలనివానిని, లంచమిచ్చినన్
బోరసినవానిఁ, బోవునెడఁ బొ్రిద్దులువుచ్చినవాని, భీతునిన్,
బరుసనివాని, రాజు పనిపంపుటకీడు వివేకభూషణా. 35

నేరమి [దొడరినదిద్దఁగ
నేరకయుం] డెడి విరక్తనృపతిని గొలువం
దూరస్థులు గాకుండెడి
వారలు దుర్మతు లుదారవైరోచనుఁడా. 36

రాజుల నతిక్రమింపఁగ
భూజనులకు భయము పాడిబొరయకయుండన్
రాజులు వెఱతురు గావున
రాజులకుం బాడి రాజరాజమనోజా. 37

అలుగుచుఁ జెరుపఁగనయ్యెడు
కొలఁది విచారింప కెత్తికొని యొరులకుఁ దో
నలుగుట తన కలుగుట యూ
యలుకయు నిధనంబు దశదిశాభరణాంకా. 38

ఉ. వారనియల్కఁజేసి బలవంతుఁడు (1)పైకొని విగ్రహించినన్
దూరముపోవుటొండె వినతుండయి వానినచొచ్చుటొండెఁగా
కీరసమెత్తికోల్ మతివిహీనత నేనుఁగుతోడఁ దా పెనన్
బోరుట; నీతిమార్గ మిది భూనుత రాజమనోజభూభుజా. 39

క. ఎందును గార్యవిచారము
డెందము గలవాఁడె తీర్పు డెప్పరమైనన్
డెందము గలఁగదు గావునఁ
బందకు మతిపుట్టదండ్రు బద్ధిసరేంద్రా. 40

క. ఆప్తు నవివేకి నొల్ల ర
నాప్తుని విద్వాంసు నొల్ల రార్యులు మంత్రి
వ్యాప్తికి మంత్రి వివేకియు
నాప్తుఁడుఁ గావలయు దశదిశాభరణాంకా. 41

క. ఆప్తు లెఱింగిన, నాప్తుల
యాప్తు లెఱుంగుదురు తత్తదాప్తశ్రవణ
ప్రాప్తమగుచుండుఁ గావున
నాప్తపరంపరను మంత్రమవియఁ బతికిన్. 42

క. ఆద్యావస్థనె రిపులను
ఛేద్యుల జేయు(నది) తడవు సేయుటయు(2)నఖ
చ్ఛేద్యము ముదిరి కుఠార
చ్ఛేద్యం బగు(నండ్రు) రాజసిద్ధాంతవిదుల్. 43

---

(1) పైదను. (2) సిద్ధయాపియఃనఖ.

క. ఆయంబు వ్యయము నొడిచిన
శ్రీయగు, సమమైన దళము చెడకుండు, వ్యయం
బాయమును నొడిచె నేనియుఁ
బాయదు పేదఱిమి సార్వభౌమునికైనన్. 44

క. నోసితనవలన డెందము
గాసిల్లినవానిఁ జెట్టఁగావగవక తా
నాసన్నవర్తిఁ జేయుట
మోసము పతికండ్రు సిద్ధముగ బద్దినృపా. 45

క. సతికంటె నబల వసుమతి;
సతి పతి లేకున్నఁ జెడుట స్వల్పమె, ధాత్రి
పతిలేనినాఁడు సద్య
శ్చ్యుతి వసుమతి కండ్రు నన్నెచోడనరేంద్రా. 46

క. నాయకవిరహితమును బహు
నాయకముఖ్యమును బాలనాయకమును స్త్రీ
నాయకమై(1) చెడు సిరి నర
నాయకులకు నండ్రు కీర్తినారాయణుఁడా. 47

క. పరదోషకథావాదము
పరపీడోత్పాదనంబు బలిమిఁ బరస్త్రీ
హరణము సుఖముగ మనుపతి
పరమోత్పాతంబు ప్రజకు బద్దినరేంద్రా. 48

(1) నాయకమునఁ జెడు.

గద్య:-ఇది శ్రీలక్ష్మీవల్లభపాదపద్మారాధన
కమలాప్తకులపవిత్ర నన్ననగంధవారణ
రాజమనోజరాజాంక బద్దెనాఖ్య
ప్రణీతంబైన నీతిసారంబందు
రాజనీతిప్రకారం బన్నది
ద్వితీయాశ్వాసము. *

శ్రీ శ్రీ శ్రీ



* ప్రథమాశ్వాసము లేదు. పోయినది. తక్కిన రెండుప్రకరణముల చివరను "ఆశ్వాసము" నకు బదులుగా "అధికారము" అనియున్నది. ప్రథమాధికారమునఁ గవివంశవర్ణనాదు లుండనోపును.

అవిఘ్నమస్తు.

శుభమస్తు.

# బద్దెనీతులు.

## సేవకనీతిప్రకరణము.

శ్రీతన్వీభూషిత(1)వి
ద్యాతిశయోన్నతుఁడ బద్దెనాఖ్యుఁడ బుధసం
ప్రీతమనస్కుఁడ సేవక
నీతులు వివరింతు సభ మనీషులు మెచ్చన్. 1

క. పనివినినఁ గొలువవలయును
బనివినఁడే తనకుఁ దానఁ బనివినవలయున్
బనివిననిన్నృపతిఁ గొల్చిన
మనుఁజుడు మనుజాధముండు మహిఁ బద్దెనృపా. 2

క. ధాత్రీకుటుంబకత్వజ
గత్రాణనిసర్గమతులు గావున శుద్ధ
క్షత్రియు లుండఁగ నొరుల న
పాత్రుల నమ్ముదురె బుధులు బద్దెనరేంద్రా. 3

ఉ. అప్పగనాప్తుఁడయ్యు శుచియయ్యు మహాహితుడయ్యుఁ బంచినన్
జెచ్చెరఁ గ్రిచ్చకాఁగ పనిసేయఁగనోపియు విద్యగల్గియున్
మెచ్చఁగ నర్థమిచ్చియును మిక్కిలి బీరము గల్గియున్ భటుం
డిచ్చ యెఱుంగఁడేని పతి కేవయుగున్ బరవక్షభైరవా. 4

---

“ (1) తన్వీవిభూసుత.

క. పతి కలిగి తానె పోలియును
పతి నలిగించియును దానె భంగమునొందున్
బతి మతమెకాని భటునకుఁ
బతితో నాగ్రహము చనదు బద్దిన రేండ్రా.

క. పతి యిమ్మెకాని భృత్య
ప్రతతికిఁ దనయిమ్మచనదు పరుననికార్య
స్థితి యిమ్మెకాని భూతల
పతికిన్ దనయిమ్మ సనదు బద్దిన రేండ్రా.

క. నరపతి ప్రస్తవమునఁ దన
(1)పరిభవమునఁ దక్క నొందుపట్లను సేవా
పరులకు నిజాత్మరక్షా
పరతయు రమణీయమండ్రు బద్దిన రేండ్రా.

క. అలిని భృత్యునిఁ దగ దయ
నేలినపతి పెద్దయ(గును); నేర్పతి(యింటన్) (2)
మాలుడు తతెడొల్లనినాఁ
డాలూర్వశియైన భృత్యుఁ డర్జునుఁడైనన్.

చ. అఱమరలేక చెడ్డయెడ నక్కఱదీర్చినయట్టినట్టిమున్
తఱిఁ దగనీనిచోట నుపతాపము సేయక కూడుకోమలిన్
నెఱయఁ గ్రుకృమం బెఱిఁగి నెయ్యముఁ జేసిన యట్టిభూపతి
మఱితు రె కోటిజన్మముల మానగుణోన్నత బద్దిభూపతీ.

(1) పరిరంభము. (2) నేర్పరికం చెన్.

క. దొరతనము వలయునొండెను(1)
సిరిపడయఁగవలయు నృపతిచే భృత్యునకున్
(2)దొరతనము సిరియు వెలిగా
నరపతి తలమొఱుక ముద్దె నయతత్త్వనిధీ. 10

క. కెలసము సేసియు నవసియుఁ
గొలిచినఁ గొదవల్లయేనిఁ గువలయ(పతిదా)
కొలువేల యుత్తరోత్తర
ఫలసారమె రాజసేవ బద్దినరేంద్రా. 11

ఉ. జీవితమీఁడు, మూఁగ గడవఁజేసినవృత్తిఁ గ్రమక్రమంబునన్
బోవగఁజూచుఁ, దేజమునఁబుట్టెడులాభము దప్పఁజేయు,(4) స
ద్భావము బొంకుగాఁ దలఁచుఁ, బాయక నేరమె రోయుఁగావునన్
సేవకులన్ విరక్తనృపుసేవ విపజ్జలరాశిముంపదే. 12

సతియును బతియును జెలియును
వితథంబుగఁ బలికిరేని విడువఁగవలయున్
సతియుఁ దిలోత్తమయైనను
బతి యింద్రుఁడైనఁ జెలియుఁ బ్రాణంబైనన్. 13

వెడమతియై యుదారగుణవీరగుణంబులు బీజమాత్రమే
ర్పడినను నీగిపోటుఁ గలపందగు, దానగుణంబు లోభికిన్,
బొడవఁగ నోడుభీతునకు బుద్ధిగనెవ్వఁడు చెప్పుచుండఁగాఁ(5)
దొడరినమంత్రి తాన పగతుండగు నన్నగంధవారణా. 14

(1) దొరవడయవలయునొండెను. (2) దొరయును. (3) పతులన్ గొలనేల.
(4) దప్పX X; దవ్వుసేయు. (5) బుద్ధిగ చెప్పఁగ నొప్పనుండఁగా.

క. చనవున బలిమిని మదమున
జనపతి తమ్ములఁ దదాప్తజనముల నెడఁగా
మనుచుండెడుప్రగ్గడకును
మును మెలఁగిన మెలకువకును ముప్పగుఁబిదపన్. 15

క. నరపతిలక్ష్మీవిద్యా
పరిణతి, చతురులకు వీరభటులకు సేవా
పరులకుఁ దక్కఁగఁ దక్కొ
వ్వరికి నగోచర ముదార వైరోచనుఁడా. 16

క. చేరి తన చెలులుఁ జుట్టలుఁ
గోరి యభీష్టములు వంచికుడువనిసిరి ని
స్సారము నిరర్థకంబు వి
*చారింపఁగ నెపుడు దశదిశాభరణాంకా. 17

క. తలవెండ్రుకలందఱుచు
ట్టలుఁ దోఁతురు లక్ష్మిఁదోఁచుటయుఁ బాయుదుఁ; దోఁ
బలుకరుగావున లక్ష్మి
లలనయ చుట్టంబు మనుజులకు బద్దిన్నృపా. 18

చ. సిరిగల(చోటమేనఁ దనజీవముఁగల్గినచోటఁ గాలముల్)
దిరుగనిచోటఁ దేజమెడఁద్రొవ్వనిచోటను దుఃఖ‡సంఘముల్
పొరయనియట్టిచోటఁ దగఁ బుద్ధి దలంచి పరోపకారముల్
తిరముగఁ జేసికాక యవితీఱినఁజేయను ధాత శక్యమే. 19

---

* పరికింపఁగ. ‡ దగ్ధసంఘముల్

ఉ. దానగుణంబ యెన్నఁగఁ బ్రధానగుణంబది మున్ను గల్గినన్
గాని విశిష్టమై పురుషకారము నిల్వదు లోభి[నాఁగఁజ
న్నేసి]యశంబు[సత్త్వముసహిష్ణుతయున్ విభవంబువిద్యయున్
మానము బీరమున్ దనువు మన్ననయున్] వృథ బద్దిభూపతీ.

క. తగఁ బ్రోచువాఁడె జనకుఁడు
తెగఁబల్కినవాఁడె వెట్టి ధీరుండై యి
మ్ముగ మనుచువాఁడె చుట్టము
జగమున నరులకు వివేకచతురాననుఁడా. 21

చ. ధరణిపుఁ డాజ్ఞచే నరుఁడు దైవముచే దయివంబు మర్త్యుచే
సురతము ప్రౌఢచేఁ బలుకుసూనృతిచేఁ గులమాత్మవేదిచేఁ
బరు లుపకారిచేఁ గలిమి బంధులచే దొర ధర్మబుద్ధిచేఁ
బురుషుఁడు తాల్మిచే మహిమ పుణ్యముచే వెలయున్ యశోనిధీ.

ఉ. చేతులు వత్సరూపమునఁ జేకొనఁ జేసి యభీష్టవస్తుసం
ఘాతము లెప్పుడున్ గురియు కామదుఘత్వశుభప్రసిద్ధి ధా
త్రీతలధేనువుండఁ దగ తీఱమి కన్యుల నాశ్రయించి తృ
ష్ణాతురులైనఁ జొప్పదునె యర్థము రాజమనోజభూభుజా. 23

గద్య:—ఇది శ్రీలక్ష్మీవల్లభపాదపద్మారాధన కమలాప్త
కులపవిత్ర నన్ననగంధవారణ రాజమనోజరా
జాంక బద్దెనాఖ్యప్రణీతంబైన [నీతిసారంబు
నందు] సేవకనీతిప్రకారం బన్నది తృతీ
యాధికారము.

అవిఘ్నమస్తు.

శుభమస్తు.

# బుద్ధినీతులు.

## లోకనీతిప్రకరణము.

క. భానుకులదీపకుండను
భూనుతవిక్రముఁడ బుద్ధిభూపతిఁ గవిస
న్మానితుఁడ లోకనీతులు
నేనర్థినొనర్తు నధికనిపుణత్వమునన్. 1

క. ఆపద్వినీతులగుదురు
కాపురుషులు పరమపురుషకారగుణుల్ శ్రీ
ప్రాపింపవినీతులగుదు
రాపద్దశకంటె దశదిశాభరణాంకా. 2

చ. పిసిడియ కష్టుఁ, డాజిముఖభీతుఁడెబూతు, కృతఘ్నవృత్తికిన్
విసువనివాఁడెమాలఁ, డవివేకియచీకు, శఠుండ (1)(దొంగ,)దు
ర్వ్యసనియకాతరుం, డనృతవాదియె(2)కట్టిడి, మూర్ఖచిచ్చు, ఛాం
దసుఁడె మృగంబు, కొండియుఁడె దాయ, దరిద్రుఁడె వేదు
(3)[ రెయ్యెడన్. 3

క. స్థిరమతియనఁగా భువిజను
పురుషునినమ్మనది పెక్కుబుద్ధులమైనూ
నరవెల్లిపొడలుసూపెడి
(4)నరుపొరుగేమిటికిఁ గీర్తినారాయణుఁడా. 4

---

(1) సోమరివ్యసనియ. (2) కల్లరి. (3) రయ్యెడన్. (4) నరుపొరుపేమిటఁ.

క. బలిమికిఁ బాడి తపంబున
కలుగమి, సిరి(1)కోర్పు, విద్యకభిమానము, వా
గ్బలమునకు బొంకువోరయమి,
కులమున కాచారమొప్పుఁ గొమరురభీమా. 5

క. హీనునకును బలిమి, పరా
ధీనునకు సుఖంబు, దుర్మతికి రిపుజయము, మ
జ్ఞానికి బరమును, (2)నలిగెడు
వానికి సైరణ యసంభవము బద్దినృపా. 9

క. అలుకయ పగ, సౌజన్యమె
చెలి, (3)మానయ కష్ట, (4)ముప్ప సెగ్గము, విద్యా
(5)బలమేశీలము, (6)రాజ్యము
(ఫలమాజ్ఞయ) యండ్రు (బుధులు) బద్దినరేంద్రా. 7

చ. కులముకుపుత్రుచేఁ, జెలిమికూర్పమిచేఁ, దనయుండుముద్దుచేఁ,
బలుకశ్రుతంబుచే, (7)బిడెముపానముచే, మునిసంగమంబుచే,
వలనుప్రతిజ్ఞచే, దొరవివాదముచే, (8)గుణమొప్పు లేమిచేఁ,
గలిమిమదంబుచే, మది వికారముచేఁ, జెడు బద్దిభూపతీ. 8

క. కులమాచారమె చెప్పును
గలిమి శరీరంబె చెప్పుఁ గలవిద్యలు దాఁ
బలుకుబడిచెప్పుఁ గూరిమి
కొలఁదులు కూటంబె చెప్పుఁ గొమరురభీమా. 9

---

(1) కొప్పు. (2) కొలిచినవానికి. (3) మాసుట. (4) ముప్పు. (5) బలమయు. (6) రాజ్ఞ. (7) సెలఁత. (8) మెప్పు.

క. జూదము, సహాగృవాసము,
వాదము, కరిసనముపొత్తు, వడ్డియు, దొడరన్
గాదములోనను విరసో
త్పాదనకారణములండ్రు బద్దిన రేంద్రా. 10

ఉ. వట్టము లంచముఁకువయు వైద్యముజోస్యమునొజ్జకూలియున్
జట్టియుబొట్టకూలియును (1)జాగము భోగముపన్నిదంబు(2)చే
పట్టుటయున్ (3)గవిత్వమును పన్నును సుంకము నాడికోలు నే
పట్టునఁగోలుపోయి తరివాసినఁ జేరదు బద్దిభూపతీ. 11

క. పరిభవము దొడరు నెడలను
సురతమునన్ దక్క నెల్లచోఁ బురుషున కా
భరణము సైరణ, సతికా
భరణము లజ్జాగుణంబు బద్దిన రేంద్రా. 12

క. దొరలేనివానివిద్యయు
దరిద్రమహిమయును మూర్ఖతపమును పాడిన్
బొరయనిరాజ్యము మిగులన్
బరికింప నిరర్థకములు బద్దిన రేంద్రా. 13

క. ఒరుని ల్లరిగెడుకాంతకు
వరవున కనురక్తయైన వనితకు విషయా
తురలై (4)క్రిమ్మరు సతులకుఁ
బరిభవములు వచ్చునండ్రు బద్దిన రేంద్రా. 14

(1) సాగము. (2) చేపట్టలమున్. (3) కవీంద్రులును. (4) క్రమ్మరు.

క. సందియము లేమి వారిలకు
నందము; పురుషానుకూల యగుట కులస్త్రీ
కందము, మగవానికి నిజ
మందము, మరియాద పతికి నందం బెంచుఁ. 15

ఉ. సున్నము లేని విద్యమును జూడఁగ రంజన లేని వేశ్యయుఁ
వెన్నెల లేని రాత్రియును వేదము శాస్త్రము లేని విప్రుఁడుఁ
జన్నులు లేని జవ్వనము చంద మెఱుంగఁగ లేని కావ్యముఁ
మన్నన లేని రాజ్యమును మానుగనొప్పదు బద్దిభూపతీ. 16

క. సీరికి రుచి శైత్యంబా
హారమునకు వేఁడి రుచియు సంగజకేళిఁ
దారుచి యనుకూలస్త్రీ
సారంబగు చెలిమిరుచి రసజ్ఞులకెల్లఁ. 17

ఉ. తక్కువ పేదవాని తగుదానము దానము, (1) పెద్దదారిలోఁ
నెక్కటిబూని యగ్గలిక నేగు చలంబు చలంబు, పోరిలోఁ
బెక్కువిధంబులం బొడుచు బీరము బీరము, రాత్రియేకతం
బొక్కని యాలు పైఁబడిన నొల్లని శౌచము శౌచ(2)ముర్వరఁ.

క. నృపదార నిరీక్షణమును
నృపదాసీ సంగమంబు నృపనయవిద్యా
నిపుణు లొడంబడ, రెన్నఁడు
నపయశములు గాన దశదిశాభరణాంకా. 19

(1) పెద్దవారిలో. (2) పర్వను.

ఉ. ఒరుసతితోడి కూటమియు నుత్తముతోడి విరోధముం మహీ
సరపతితోడి హాస్యమును నాగము పై శయనించి నిద్రయుం
గురుల కవజ్ఞగాఁబలుకు క్రూరులనాప్తులఁ(1) జేసికొంటయుం
మరణము(2)దెచ్చు శీఘ్రగతి మానగుణోన్నత బద్దిభూపతీ.

చ. పలువురతోడి విగ్రహము బాంధవవర్గముతోడి గర్వముం
గులసతితోడి పోరు కడుక్రూరునితోడి సఖత్వముం మహా
(3)బలయుతుతోడి రాపు పరభామలతోడి రహస్యభాషలుం
దలఁపఁగ హానికార్యములు తప్పవు సన్నుతగంధవారణా. 21

క. రిపుపొత్తు పాముపొత్తును
గపటుండగు విప్రుపొత్తు గడుసరిపొత్తుం
విపరీతభార్యపొత్తును
నెపమునఁ దా విడువకున్న నేరమువచ్చుం. 22

క. కడఁగి యగోచరవస్తువు
వడయుదునని కడుఁబ్రయాస పడఁదొడఁగి జడుం
డెడపని మానోనువేదనఁ
బడు గీడ్పడుబేలనాఁగఁబడు నిడుమఁ బడుం. 23

ఉ. ఏనుఁగుదోమఁజేయు,గుణహీనుగుణోన్నతుఁజేయు,సింహముం
బూని యజంబుసేయు, మగపొల్ల బరాక్రమశాలిఁజేయు, స
న్మానుని హీనుఁజేయుఁ గడుమందునిఁ జాలవివేకిఁజేయుఁ,దాఁ
గాన ధరిత్రిదైవమును గాదనరాదు వివేకభూషణా. 24

(1) జేయువారికిన్. (2) వచ్చు. (3) బలియురు.

క. చెడినట్లయుండి మనుదురు
చెడని తెఱంగుననుండి చెడుదురు మనుజుల్
చెడితినని (1)వగను జెడనని
(2)కడువీగును జెందఁ జెఱుకగల మనుజుఁ డిలన్. 25

క. ఒనరఁ బురాకృతఫలమున
కనురూపము చిత్తవృత్తి యగుటను కర్మం
బనునూది పిఱుఁదత్రాడై
చనుమతి, దనవశముగాదు సర్వజ్ఞునకున్. 26

క. ఎట్టిది పురుషుపురాకృత
మట్టిదమతి సంభవించు నట్టిరచెలులున్
జుట్టలు నగుదురు కర్జం
బట్టిదవర్తిల్లు కడఁక యట్టిదపుట్టున్. 27

వ. కరిసన మొప్పఁజేసి కడకన్ నృపుఁగొల్చిన జూదమాడినన్
దరిసిన(3)నిల్లుదోసి పరదేశముఁబోయిన విద్యగల్గినన్
సిరి దనపూర్వజన్మమునఁ జేసినయంతియ కాక కల్గునే
పొరలిన మిట్టిపడ్డఁ దలపోఁతలువోసిన వెచ్చనూర్చినన్. 28

. దుష్టజన (4)నిగ్రహంబును
శిష్టపరిపాలనంబుఁ జేసినపతికిన్
దృష్టము (5)గానఁగఁబడదా
దృష్టము సాధింప నొండు (6)దీక్షలవేలా? 29

(1) వగవ. (2) విఱ్ఱవీఁగడె. (3) ధాత్రి. (4) విగ్రహంబు. (5) గానుమతి యదృష్టము. (6) దీక్షలదేవా.

## లోకనీతిప్రకరణము.

ఉ. వేదముకంటె విద్య మురవిద్విషుకంటెను వేఱదైవముల్
జాదులుకంటెఁ బువ్వులును జాహ్నవికంటెను బుణ్యతీర్థముల్
సోదరుకంటెఁ జుట్టమును జూదరికంటెను బాపకర్ముఁడున్
లేదనుకంటెఁ (1)బాపమును లేదు మహిన్ బరపక్షభైరవా. 30

ఉ. శ్రీవిభుఁ డైన బద్దెవిభు చేసిన (2)నిస్తులనీతిసార ము
క్తావళి శిష్టలోకహృదయప్రియమై యలరారుఁగాత యిం
దీవరగర్భుఁడున్ హరియుఁ దేజమెలర్పఁగఁ జంద్రసూర్యులున్
దేవగణంబులున్ బుధులు దిక్పతులున్ గలయంతకాలమున్

క. ఖ్యాతిగ బద్దెన చెప్పిన
నీతియ కడు నొప్పు సకలనీతులలోనన్
భాతియొనర్చుచు భువిలోఁ
బూతనుబుద్ధియు యశంబుఁ బుణ్యము (3)నిచ్చున్. 3

గద్యః-ఇది శ్రీలక్ష్మీవల్లభపాదపద్మారాధన కమ
లాప్తకులపవిత్ర నన్నసగంధవారణ రా
జమనోజరాజాంక బద్దెనాఖ్యప్ర
ణీతంబైన (4)నీతిసారంబందు
లోకనీతిప్రకారంబన్నది
చతుర్థాధికారము.



(1) దాపమును. (2) నిధల. (3) గల్గున్. (4) నీతిసాగరంబు.



శ్రీరస్తు

శుభమస్తు. అవిఘ్నమస్తు

# చిత్రాడవేంకటేశ్వరశతకము

—:o:—



శ్రీ భూదేవీసమేతాయ
భక్తాభీష్టప్రదాయినే
చిత్రాడపుంవాసాయ
వేంకటేశాయతేనమః.

విధాయగురువందనం మహితవిఘ్నరాడ్వందనం
మదిష్టసురవందనం తదనుభారతీవందనం
అమందబుధవందనం సకలవిద్వదానందనం
వదామిశతకంబు ధావృషగిరీశ్వరానందనం.

పూర్వంవ్యాసపతంజలి పభృతి భిర్వ్యాఖ్యాత్రషట్కంకృతం
ధాత్రీవేదచతుష్టయంవిఖనసాసూత్రంచయద్వృత్తకృతం
తేషాంతత్వపదార్థ వేదినమహాం వేదాంతవంశాంబుధే
రాకాచంద్ర మనంతదీక్షితగురుం వందేశ్రితజ్ఞానదం.

శ్రీమద్వేంకటనాయకార్య కృతసాపాలస్య గురుస్వాజ్ఞయా
యద్వేత్రాగ్రివిచాలనేత్రి భువనం సంరక్షితావస్థితం

ప్రత్యూహాద్రివిభేదనాశనినిభం మోక్షప్రదం జ్ఞానినాం
వందే సూత్రవతీపతిం తమనఘం విఘ్నోపశాంత్యై సదా.

స్మరామి మనసా శ్రియా సకలలోకమాతా స్థితం
వదామి వచసా భువా హ్యఖిలలోకధాత్ర్యాశ్రితం
నమామి శిరసా గురుం త్రిజగతాం మనోభీష్టదం
సదా పరిచరామ్యహం వృషగిరీశమిష్టం విభుం.

శారదా మదనే విశారదా శారదాంబుజవిభాసురాననా
శారదేందుధవళా మమ మానసే సర్వదా వసతు సర్వదాదరాత్.

సచ్ఛాత్రబృందం యదపాంగదృష్ట్యా
షట్శాస్త్రవేదాకలనక్షమం స్యాత్
తేభ్యో మహద్భ్యో ఖిలభాసురేభ్యో
నమో నమో భాగవతోత్తమేభ్యః.

శ్రీకృష్ణార్యకృపావలబ్ధ నిగమాలంకార కావ్యాగమ
శ్రౌతస్మార్తవిధి ప్రయోగనిపుణ శ్రీపద్మనాభార్యజః
శ్రీవైఖానస పాంచరాత్రవిదిత శ్రీవిష్ణుదివ్యాగమప్రాజ్ఞో
నంతసుధీవరో విజయతే యో సాహవిద్యాజకః.

శాఖా యస్య తు తైత్తిరీయవిదితా సూత్రంచ వైఖానసం
గోత్రం గౌతమమేవ కర్మ హవిషాం మార్గ శ్ర్చుతిర్యాజుషీ
శాలోయం నిగమాంగ మప్రివచనై ర్వేదార్థ నాం యాపిత
స్స్వాచార్యస్తు పితాపితామహనిభ శ్రీపద్మనాభాహ్వయః.

శ్రీమద్గౌతమగోత్రజస్య విదుషోనంతార్యనామ్నః కవే
స్తస్యాహం నరసింహనామ విదితశ్శిష్యస్తురీయోనుజః
శ్రీమద్వేంకటనాయకాస్పదమిదం హృద్యం సతాం శృణ్వ
తాం, పద్యానాం శతకం కరోమి విమలం విద్యానవద్యాత్మనాం

శ్రీవేంకటేశ్వర విభోమయితేనుకంపా
యద్యస్తిసం స్తుతిమహాంకర వాణిశక్త్యా
నోచేత్కథం సురవరైరత్ర సోప్యగమ్యాం
బ్రిహ్మాది భిశ్చవచసః ప్రిభనామికర్తుం.
శ్రీవేంకటేశ్వర విభోభవతా ప్రణీతం
కర్మాఖిలం నసుకరంచిద భూదవేద్యం
మత్వావ్యశక్య మితితేభజనం ప్రిపత్తి స్సన్త్వా
ద్విధోస్మిచరమం వచనంత వాహం.
శ్రీవేంకటేశ్వర విభోనమయాప్యధీతం
తప్తంతపోనహిహుతం నచనాస్తిదత్తం
ఆరాధనం నవిధినాకృతమేవ తేషాం
చిత్రాద్రివాస కృపయాపరి పాహిదీనం.
శ్రీవేంకటేశ్వరవి భుంజగతీసురాణాం
సంసార మాకలయతాం మననాస్యసారం
హింసాకరాసురత మిన్రిగానవాంసం
కంసాసురారిముకశం శింసానవామి.
శ్రీవేంకటేశ్వర విభోపరి పాహిమాంత్వం
వేదండదైత్యపరదండన పండితస్య
కోదండదండ పరిఖండనశౌండశుండా
దోర్దండమండలను మండితకాండదండః.
శ్రీవేంకటేశ్వర విభోభవతః ప్రిసాదా
ప్ప్రాప్తింతనుం చరణయోరజ సావ్యహల్యా
త్యక్త్వాధగౌత మమగాన్ముదితాసతీ
తత్పాదారవింద మునిశంకల యాముచిత్తే.

శ్రీవేంకటేశ్వరవిభో శేశయనన్నికాశ
సాన్వస్యప్రభాహసిత శారదశీతరశ్మేః
సీతాశయాచపి శితాశపినాశనేశ
కీశేశసంశయ నివాస శరాసనోసి.

శ్రీవేంకటేశ్వర విభోభవతాచసర్వం
జ్ఞాతంమయూన హిమదస్తి సమోహికో
వాత్రితాప్యయం నదవనీయ ఇతీహలోకే
చిత్రాద్రివాస పరిపాలయ మాందయాళో.

శ్రీవేంకటేశ్వరవిభో కరణత్రయేణ
ప్రాయేణయద్దురితమే వకృతంమయాసీత్
తస్మాన్నివారణ కృతేపిచాస్తి శక్తిర్నష్టా
విమోచయతుమాం దురితాత్ప్రపాతే.

శ్రీవేంకటేశ్వర విభోభవతాహి పూర్వం
మామేకమేవశరణం వ్రజసర్వధర్మాన్
త్యక్త్వాధసర్వ దురితాదపిమోక్ష యిష్యేత్వా
మాంశుచస్త్వమితియా సుకృతప్రతిజ్ఞా.

శ్రీవేంకటేశ్వర నిశమ్యత వప్రతిజ్ఞాం
తత్రత్యమాశ్వదమహం శరణంప్రపన్నః
త్వంమాంతు సర్వదురితాత్పరిమోక్ష
యిత్వాచిత్రాద్రి వాసభగవన్భవ సత్యసంధః.

శ్రీవేంకటేశ్వర భుజాంతరమేవ సద్మయస్యాస్తు
జన్మవసుధాత వదామచాసీత్
యద్వీక్షణాశ్రియ మిదంజగతాంత్రయం
వై బద్ధస్త్వయాంబుధిర బంధిచయత్ప్రసేతాం.

శ్రీవేంకటేశ్వర విభోదయితాం శ్రియంతాం
రూపేణ చేష్టిత గుణై ర్భవతోను రూపాం
త్వద్వల్లభాం భగవతిం కృపయా
శ్రితానామిష్టార్థ దాముదధిజాం ప్రణమామినిత్యాం.
శ్రీవేంకటేశ్వర విభోకృపణాయమహ్యం
దాతుంత్వ మర్హసినియం గుణకీర్తనేతే
చిత్రాద్రివాస శరణాగత వత్సలత్వా
త్వత్పాదపద్మ మనిశంశరణాగతోస్మి.
శ్రీవేంకటేశ్వర జనార్దన వాసుదేవగోవింద
మాధవహరేచ్యుత కృష్ణవిష్ణో
శ్రీకేశవత్రిభువనేశ ముకుంద రామ
నారాయణేతిసతతం స్మరణంప్రయామి.
శ్రీవేంకటేశ్వర విభోశరణాగతస్య
చిత్తేమమాస్తుసతతం తవపాదభక్తిః
సంసారసాగరవి తారణమిచ్ఛతాం
నారోత్మమోంధకార వినివారణసూర్యరశ్మిః
శ్రీవేంకటేశ్వర భవచ్చరణారవింద
ధ్యానామృతాంబునివి గాహననిర్మలాత్మా
బ్రహ్మాదిభిర్యదికృపా రహితైరగమ్యాం
గచ్ఛామితే పదమ నన్యగతిః కృపాయాః.
శ్రీవేంకటేశ్వర విభోప్రణమామిమూర్ధ్నా
పంచాయుధాన్య హమనన్యమనాస్త్వదార్య
శ్రీనందకప్రవర శార్ఙ్గపదాబ్జచక్రాన్యా
క్షానకాండపటుదైత్య నిబర్హణాని.

శ్రీవేంకటేశ్వరవిభుం శిరసానమామి
ధ్యాయామ్యనన్య మనసావచసావదామి
చిత్రాద్రివాసమురసా శ్రియమాదధానం
హస్తద్వయేనకు సుమైరపిపూజయామి.
శ్రీవేంకటేశ్వర విభోతవవత్సలత్వాత్
జ్ఞానాదిదివ్యగుణ షట్క విరాజితత్వాత్
కామాదిదోషరిపు షట్క పరాజితంమాం
త్వంపాహివీక్ష్య కృపయాఽచ యంనిరస్య.
శ్రీవేంకటేశ్వరమమ ప్రిబలారిపూద్వా
దేహాభిమానజనితౌ జగతిప్రసిద్ధా
జ్ఞానాసినాతిని శితేననిశాతనీయా
వైరాగ్యఖేటము పగృహ్యాకదానుభిందామ్యాం.
శ్రీవేంకటేశ్వర విఘుంతుద చైద్యనక్రి
దైత్యాదిదుష్టరిపు కంధరకర్తనాయ
పాణౌబిభర్షి నిశితాశ్రీసుదర్శనం
యత్తస్మైనమోస్తు సతతంచతమోపహాయ.
శ్రీవేంకటేశ్వర విభోనిఖిలాబ్జజాండ
జన్మస్థితిప్రలయ కారణమప్రమేయం
వేదారటంత్యకృత కాస్మృతయోభవంతం
నారాయణంపరమ పూరుషమాహురార్యాః.
శ్రీవేంకటేశ్వర భవాన్పురుషాత్పరస్మాదూర్ధ్వ
హైరవాతరద జాండకటాహమధ్యే
సంకర్షణాది భిరచింత్యగుణైశ్చతుర్భిః
బ్రహ్మాది దేవసనకాది మునీంద్రసేవ్యైః

శ్రీవేంకటేశ్వరభవ ద్విభవావతారా
శ్రీరామకృష్ణనరసింహ వరాహముఖ్యాః
పర్యాప్నువంత్వ మరసాధుజనావనాయ
దుష్టక్షితీశజనదైత్యని బర్హణాయ.
శ్రీవేంకటేశ్వర విభో ఖిలదేహ
దేకక్షేత్రేషుసర్పిరివ వహ్నిరివేంధనేషు
దేహేషుతిష్ఠతిభవానఖిలాంతరాత్మ
శాస్తాచభూతనివహస్యచరాచరస్య.
శ్రీవేంకటేశ్వరహరే శ్రితవత్సలత్వాల్లోకే
స్మదాద్యఖిల దీనజనావనాయ
గ్రామాగ్రహార పురవేశ్మనదీవనాద్రి
ష్వర్చాత్మనాసిజని మాన్తుసులభోజనానాం.
శ్రీవేంకటేశ్వర జనానపిపాతుకామస్త్వ
చార్చాత్మనావతరణం కృతవాన్ప్రభోత్వాం
క్షేత్రేషురంగ వృషశైలగజాద్రి
భద్రిసింహాచల ప్రముఖదివ్యనికేతనేషు.
శ్రీవేంకటేశ్వరజలాంశుక ధూపదీపనైవేద్య
పుష్పముఖవాస ఫలార్పణాద్యైః
ప్రీతఃసుచేలమున యేపియథాసిపూర్వం
దాతాభవాద్య నిజభక్తజనాయలక్ష్మ్యాః.
శ్రీవేంకటేశ్వర విభోభవదీయపద్మ
సమ్మార్జనాంబు పరిషేచన లేపనాద్యైః
స్తోత్రాభివందన పరిక్రమణప్రమోద
గీతాదికర్మ విరచించనరక్షకోసి.

```
ఇందిరాహృదయమందిరాద్యతే కందబంధుర శుభాంగసుందర
    నందనందన ముకుందవందనం వచ్మి వేంకటపతే నిచందనః
కుండలీంద్రశయనస్వవాహినీ
    మండలీంద్రకృతదైత్యదండనః
    అండజేంద్రనగమందిరావమా
    మండజేంద్రతురగాభిమండితః.
పుండరీకజ భవేంద్ర వందితః
    ఖండితామరవిరోధి కంధరః
    పండితేంద్ర నుత సుందరాంఘ్రికః
    కుండలీశ గిరిమందిరావమాం.
ఇంద్రాది బృందారక వందితాంఘ్రిం
    చంద్రాననం చందనచర్చితాంగం
    గోబృంద బృందావన సంచరంతం
    గోవిందమీడే భుజగాచలేంద్రం.
దానవేంద్ర కులపర్వతాశని
    ర్మానవేంద్ర కృత మిత్రతారకః
    కోసలేంద్రకుల వార్ధిచంద్రమాః
    పన్నగేంద్రగిరినాయకావమాం.
మూకోవగత్యసిశమేవ నికేతుతేంధః
    పంగుర్గతిం ప్రలభతే బధిరశ్శృణోతి
    దీనోప్యతీవ ధనవాన్భవతిః ప్రసాదా
    న్నైతనృపోభవతి వేంకటశైలనాథ.
శ్రీమద్వేంకటనాథతే యదికృపాదీనోథనాథోస్మ్యథవే
    నోప్యేచేత ద్విపకేతవానితిబుధాః పాపిహంస్వస్త్రాదయః
```

రక్షాంయస్య కరోమితస్య కృపయావిత్తం హరామిత్రియ
త్తథ్యంతద్వచనం హరేః ప్రియతరంనాన్యస్యవిత్తంతవ.
సనకాదియోగివర్యై రనవరతా సేవ్యమానపదపద్మః
చిత్రాద్రివేంకటేశ క్షిప్రం మేప్రదిశ పాదభక్తింతే.
మిత్రాబ్జనేత్రసుభగసుత్రామా ద్యమరవినుతచారిత్రః
చిత్రాద్రివేంకటేశ స్వాశ్రితదేవతాతరవతాన్మాం.
దాసోహం తే వృషగిరిపతే పాలనీయప్రియత్వా
త్స్వామీనూనం త్వమసిసతతం రక్షకోమేత్వమస్మి
నాన్యోపాయ స్త్వదఖిల జగద్రక్షకాఛ్రీనివాసా
త్త్రాస్మత్రాతాభవభవభయాత్సర్వదా మేదయాళో.
స్థితమతనుతమోంతలోకమాసీద్ధృతం
యైర్వృషగిరితటకోద్య ద్రాజహంస భియోగాత్
గురుకవిబుధమిత్రై ర్భాగవసూరిద్విజేశై
రనవరతసుసేవ్యం విష్ణుపాదంస్మరామి.
కలిదోషహారం కరుణాజలధిం
కమనీయవపుః కలితంపరమం
కమలాలయవక్షసమాదిగురుం
కలయేసతతం వృషశైలపతిం.
పాదంతే కమలోద్భవస్తుపయసా సంక్షాళ్యపూజాంహరే
తత్ప్రక్షాళనతోయమేవ శిరసాధృత్వాస్తుతించేశ్వరః
అగ్నీంద్రాదిసురప్రజస్స్వ మకుటైర్నత్వానుతించాకరో
త్తస్మైశ్రీవేంకటనాయకత్రికరణైః కుర్యాం నమస్తేసదా.
శారదసన్నుత దివ్యగుణాకర
క్షీరపయోనిధి మధ్యనికేతన

నీరదసన్నిభగాత్ర మనోహర
మానవమాధవ వేంకటనాయక.

పురుషార్థాంశ్చతురోపిమోక్షసహితాన్ధర్మార్థకామాన్విశన్
యస్మిన్ యస్యమనోరథో యదిభవేత్తంతస్యధర్మాదికం
దాసాన్నస్త్వ చిత్రవాడనిలయ శ్రీవేంకటాద్రీశ్వర
శ్రీభూమండలదివ్యపార్శ్వయుగళః పాహిప్రసాదార్థినః.

శ్రీమద్వేంకటనాయక ద్రుపదజా ప్రహ్లాద వేదండరా
ట్కాళింగాహి విభీషణామరగణాహల్యాంబరీషాదయః
గోపీగోకులగోపబృంద హరిరాట్కాకార్జునేంద్రాదయ
శ్చైతే తే శరణాగతార్తిహరణే సంత్యేవమే సాక్షిణః.

శ్రీమద్వేంకటనాయక క్షితిపతే రక్షీణలక్ష్మీవతః
క్షోణీకాంతస్య చిత్రవాడనగరే తస్యైసుపుత్రందిశ
క్షోణీరక్షణ దక్షమక్షయ కృపావీక్షాసుసంరక్షిత
క్షోణీనిర్జరదక్షమక్షయ సుఖాపేక్షావతామిష్టదం.

ఇందిరాహృదయారవిందమందిరకందసుందరశుభాంగమండితం
నందనందనముకుందవందనం కుర్మ్యతే వేంకటపతేర్నచందన.

అండజేంద్రనగమందిరావమా
మండజేంద్ర తురగాభిమండితః
కుండలేంద్రశయన స్వవాహినీ
మండలేంద్రకృత దైత్యదండనః.

ఇందిరాశిఖరి మందిరావమాం
వండితేంద్రనుత సుందరాంఘ్రికః
పుండరీకజ భవేంద్రవందితః
ఖండితామరవిరోధికంధరః.

కమలాసనవినుతామలగుణ వైభవచరితం
కమలాకర విలసత్పదకమలానతవిబుధం
అచలాంగుణ కమలాకృతి కరపరిచితచరణం,
భజమానస భుజగాధిప గిరినాయకమధునా.
పన్నగేంద్రగిరి మస్తకాలయో
దానసేంద్రకుల పర్వతాశనః
కోసలేంద్రకులనాథ చంద్రమా
రాఘవేంద్ర పరిపాలయాద్యమాం.
తరుణారుణ కిరణారుణ కరపంకజయుగళం,
నరుణాలయ తరుణామణి జననాకరచరణం,
కరుణాకర మరుణాధర మళికుంతలమనిశం
ఫణిరాడ్గిరి శిఖరాలయ మనఘుంపరమీశే.
శారదాంబుజవిభాసురాననా శారదా వదనసేవిశారదా.
శారదేందుధవళామమాననే సర్వదావతునసర్వదాదరాత్.
శ్రీవేంకటేశ్వరకృతా భవతాప్రతిజ్ఞా
మామేక మేవశరణం వ్రజసర్వధర్మాన్
త్యక్త్వాధసర్వదురితా త్పరిమోచయిత్వా
చిత్రాద్రివాస భగవన్భవసత్యసంధః.
శ్రీవేంకటేశ్వరవిభో కృపణాయమహ్యం
దాతుంత్వమర్హసినియుం గుణకీర్తనేతే
చిత్రాద్రివాస శరణాగతవత్సలత్వా
త్త్వత్పాదపద్మమనిశం శరణాగతోస్మి.
శ్రీవేంకటేశ్వరసుదర్శనపాంచజన్యౌ
పంచాయుధాన్యహమనన్యమనాస్మరామి.

కామాదికీ ప్రివరనందక దివ్యఖడ్గా
జ్ఞానకాండసహముద్దైత్య నిబర్హణాసి.
శ్రీవేంకటేశ్వరవిభుం ప్రినదంతిధీరా
నీలాద్రివేంకట మహాధ్రిపతిం ప్రసిద్ధం
ద్వావత్రితౌపతితపావనదీనబంధూ
త్వామిత్య మంత్య శరణాగతరక్షకాఖ్య.
శ్రీవేంకటేశ్వర విభో భవతో త్రిలోకే
దీనార్తజమంతు శరపాలనతత్పరత్వాత్
నీలాద్రివేంకట మహీపతినామధేయం
త్వామేవత త్రివిధరూపమహం వదామి.
శ్రీవేంకటేశ్వరవిభోన గజావళించ
నస్యందనాంశ్చభటాన్ నతువాజిరాజిం
యాచేప్రిసాద మవనీంభవతః క్షమాం త్వాం
చిత్రాడవాసభగవన్ త్రివిధాత్మకోహం.
అరికేతనకులిశాంకుశ జలజాంబుజకలితం
కలికల్మషవినివారణ పటువాహినిజకం
జనకాధిపభజమానస తనయాకరకమలాంబుజలలితం
కరవాణిసుచరణం తవశరణం మమసుగుణం.
కరుణాకరవినతాసుత తురగాటనచతురం
చతురాననసుతివైభవ ఫణిరాడ్గిరినిలయం
రజసాపరతరుసంస్కృత ద్రుపదద్భుతచరితం
కరవాణిచచరణం తవశరణం మమసుగుణం.
విధినిర్మితభువనత్రియ పదవిక్రమకలితం
ఖరదూషణశుకసారణ తరుఖండనపరశుం

దాసాన్నస్త్వవచిత్రపాద నిలయశ్రీవేంకటాద్రీశ్వర
శ్రీభూదేవ్యనసూన్నపార్శ్వయుగళః పాహిప్రపన్నాన్నిజాన్.
చిత్రంతేమహిమానుచేలమునయె దాతాస్యనన్ప్రశ్రియా
భిక్షిత్వాహరవైరిణాం మఘవతే త్రైలోక్యరాజ్యశ్రియః
క్షేత్రంయద్యపి వేంకటాచల పతే తాదృశవాసస్యతే
నాదత్తాంభువినోపతిష్ఠతయతి న్యాయః కథంస్యాంమృషా.
బ్రహ్మాండోదరసంస్థితాఖిల జనత్రాణాయ రంగస్థలే
సౌలభ్యాదిగుణాన్వితః ఫణిపతేర్భోగేశయానస్థితః
త్వన్నాభీకమలోద్భవ ద్వ్యఖనసంజాతవేదస్తుత
శ్రీభూదేవికరార్పితాత్మ చరణశ్రీరంగ రాణ్మామవ.
విశ్వస్యావనకర్మ శేషఖనన సంప్రశ్నితేన ప్రార్థితాం
వంశేచానకదు గుర్భేజనిమగాః కృష్ణాత్మనాయః పురా
ధాతుస్త్వతసితత్వచింతనః శాస్త్రజ్ఞ వైఖానస శ్రీ
తారాధనరాశిశ్చపతతం శేషాద్రిరాణ్మామవ
వేదాంగపవిరాజమానగరుడా రూఢోంజనాగాంగితో
వేదండార్తినివారణాయ మకరంచ్ఛిత్వాపనాయస్స్వయం
వేందండాచలమస్తకం వరదరాజాఖ్యాతనామ్నాస్థిత
స్సన్త్వాంవేంకటనాయకా త్రిజగత్త్రాతాభవాద్యప్రభో.
సీతాంతత్క్షణమధ్యభాగవిరసన్మాత్ర్యాఘు శ్చాప్యానలః
కోదండేపసుఖండితామర రిపుప్రాణిక్షితాఖండలః
రక్షో నరరాజమోర వారిసంరక్షితౌచత్వమా
శ్రీమద్వేంకటనాయకత్వ మధునాభద్రాద్రిరాణ్మామవ.
యస్త్వంశ్రీబలభద్రరామసహిత స్స్వద్దర్శనాయాగతాం పాన్
స్వాన్ పతితానపితృజగతాం నాథస్సుభద్రాశ్రితః.

త్వం తే శ్రీపురుషోత్తమేస్థితిమగాః పాతుంప్రసాదాన్మదా
స్సత్వంవేంకటనాయకాద్య కృపణాంశేషాద్రిరాణ్మామవ.

స్మరామిమనసాశ్రియా సకలలోకమాతా స్థితం
వదామివచసాభువా హ్యఖిలలోకధాత్ర్యాశ్రితం
నమామిశిరసాగురుం త్రిజగతాంసుసంరక్షకం
సదాపరిచరామ్యహం వృషగిరీశమిష్టప్రదం

కలయేసతతం వృషశైలపతిం
కలిదోషహరం కరుణాజలధిం
కమనీయవపుః కలితంపరమం
కమలాలయ వక్షసమాదిసురం.

కమలాయతాక్ష నమలాత్మవైభవం
విమలాంబుజాస్య మతులాభిరామరం
పరసానమామి శిరసాచ వేంకటం
మనసాభజామి వచసాస్తవామ్యహం.

మూకోవదత్యనిశమే వనీకేతుతేంఘ్రోః
పంగుర్గతింప్రలభతే బధిరశ్శృణోతి
దీనోప్యతీవధన వాన్భవతః
ప్రసాదాన్నైతత్కృపా భవతివేంకటశైలనాథ.

సప్తప్రాకారభూ వనిధరవర శేషాద్రికూటాగ్రగూఢ
శ్రీదేవీమందిరాభూరమణి మపిలసన్నీలమేఘోజ్జ్వలాంగః
శ్రీమన్నీలాద్రిరాయప్రభువర నగరీప్రాంతదేశైవిరాజ
చ్చిత్రాడగ్రామవాసీమమభవతుముదే వేంకటేశోముకుందః.

బ్రహ్మేశానసురేశముఖ్యవిబుధైః రాత్రిన్దివ్యైసుమనోభ్యైర్వి
శాంబల్యాఖండలపూర్వదేవనివహైః రాత్రిన్దివ్యశ్యమానోప్యపినద

హంచిత్రాడనివాస వేంకట పతేసీలాద్రిరాయప్రభోర్దేశే
పుణ్యజనై రమర్త్య చరిత్రై ర్మాన్యై ర్వ్యహ్యామాన్యఃకథం.
శాఖాయస్యతు తైత్తిరీయవిదితా సూత్రంచ వైఖానసం
గోత్రంగౌతమమాస హవిషాంయోగాశ్శ్రుతిర్యాజుషీ
కాలోయంనిగమాగమప్రవచనై ర్విద్యార్థినాం యాపిత
స్తస్యాచార్యస్తుపితాపితామహనిభ శ్శ్రీపద్మనాభాహ్వయః
శ్రీమద్గౌతమగోత్రజస్యవిదుషోనం తార్యనామ్నోగురో
స్తస్యాహంనరశింహనామ విదితశ్శిష్యస్తృతీయోనుజః
శ్రీమద్వేంకటనాయకాస్పదమిదంహృద్యంసతాంశృణ్వతాం
పద్యానాంశతకంచకార విదుషాంవిద్యానవద్యాత్మనాం
శ్రీభూదేవీసమేతాయ భక్తాభీష్టప్రదాయినే
చిత్రాడాఖ్యపురీశాయ వేంకటేశాయ

మంగళం శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.





శ్రీరస్తు

శుభమస్తు. అవిఘ్నమస్తు

# శ్రీ మదనగోపాలశతకము.



శ్రీ కృష్ణ కేశవ చిన్మయానందము
కుందగోవింద వైకుంఠవాసుదేవ
నారాయణ దేవదేవ యనంత
నరసింహావామన గరుడగమన
క్షీరాబ్ధిశయన లక్ష్మీనాథ పుండరీకాక్ష. హృషీకేశయాత్మ
రూప, మధుసూదన త్రివిక్రమజనార్దన పురాణపురుష
కౌస్తుభమణి భూషితాంగ
శంఖచక్రగదాఖడ్గ సహితహస్త
పాహిమాం దేవయని మిమ్ముఁబ్రస్తుతింతు
భూరిమయువాస కోలంకపురనివాస
మదనగోపాల రాధికా హృదయలోల.

సీ. గుణతరగౌతమ గోత్రపవిత్రుండ విఖ్యాతవంకాయలపాటి
కులుఁడ, వెంకయమంత్రి సాధ్వీమణి కామమాంబాగర్భ
వార్ధిజైవాతృకుండ, గుండు వెంకటరామ కోవిదగురుదత్త

శుద్ధపంచాక్షరీసిద్ధియుతుఁడ, సకలలక్షణలక్ష్య సాహితీని
పుణుఁడ శైవవైష్ణవసదాచార రతుఁడ
వెంకటాఖ్యుఁడనే జగద్విదితముగను
శతకమొనగూర్తు త్వత్సమర్పితముగాఁగ ॥భూ.

సీ. దండంబు దోర్దండ మండితకోదండ దండంబు భూరిప్రతా
పచండ, దండంబు పాలితార్త స్తుత్యవేదండ దండంబు ముని
వరదానశౌండ, దండంబు దండితాగత నిశాచరకాండ దం
డంబు వైరిరౌద్రప్రకాండ, దండంబు భక్తసంత్రాణ మ
హోద్దండ దండంబు బ్రహ్మాండధరప్రచండ
దండమో పాపతిమిర మార్తాండ నీకు
యనుచు మ్రొక్కెదనను బ్రోవుమయ్య వేగ ॥భూ.

సీ. శరణు జగత్కర్త శరణు జగద్భర్త శరణు జగద్ధర్త శరణు
శరణు, శరణు తాండవలీల శరణు పాండవపాల శరణు పండిత
ఖేల శరణు శరణు, శరణు శంకరపక్ష శరణు కింకరరక్ష శరణు
పంకరుహాక్ష శరణు శరణు, శరణు దయాసార శరణు జయా
ధార శరణు నయాగార శరణు శరణు
శరణు వారణ వారణ శరణు శరణు
శరణు కారణ కారణ శరణు శరణు ॥భూ.

సీ. వీరాయ గోపికాజారాయ రుక్మిణీదారాయ భవభయోత్తా
రణాయ, శూరాయ మునిజనాధారాయ కరుణాప్రచా
రాయ సత్యప్రచారణాయ, ధీరాయ వార్ధిగంభీరాయ సద్గు
ణవారాయ దురితనివారణాయ, స్ఫారాయ ధృతజగద్భా
రాయ ననసుకుమారాయ కృతశత్రుమారణాయ
తేనమోయంచు వినుతింతు ధీరమతులు

సిద్ధసామ్రాజ్య లక్ష్మిచేఁ జెలఁగుచుండు ॥భూ.

సీ. ముసిడితుప్పలకు గొప్పలుద్రవ్వ నేటికి వట్టినూతికి యొరల్
గట్టనేల, గొడ్డుగోతుకునొట్టి గొట్టుకాయంబేల మానక
మర్త్యుకు పైటమాటదేల, అంధురాలికి నిల్వుటద్దమేటికి నపుం
సకునకొయ్యారంపుచానయేల, దొంగముండకు వ్రతో
ద్యోగనిష్ఠలవేల జారకాంతకు సదాచారమేల
క్షుద్రగుణునకు సజ్జనగోష్ఠియేల
మోటకొయ్యకు మృదువైనమాటలేల ॥భూ.

సీ. దురితాత్మునకు దేవగురుపూజనంబేల కర్ణహీనులకు చౌక
టులవేల, జ్వరరోగకృశునకు హరిచందనంబేల పరమలో
భికి దానపటిమయేల, కర్మబాహ్యునకు గంగాస్నానమేటికి
కామాంధునకు తపఃశాంతియేల, తిండిపోతుకు నిత్యదేవ
తార్చనలేల వెఱ్ఱివానికి సద్వివేకమేల
మూర్ఖజనునకు సతతప్రమోదకరణ
సాధుసజ్జనగోష్ఠి ప్రసంగమేల ॥భూ.

సీ. కుళ్లుతొత్తుకు గంధకుసుమాగరులవేల గూదలంజకు జరీ
కోకలేల, మొండికట్టెకు ధర్మములుదెల్పఁగానేల సొట్ట
నికి నాట్యశోభలేల, అంధురాలికి నయనాంతసంజ్ఞల
బోసిదానికిని తాంబూలమేల, పలుగుదండకు పతి
మార్గంబేల చెడాగుముండకు నీతిజెప్పనేల
మూర్ఖజనునకు బహుతరామోదకారి
సరసకవితావిచిత్రవైఖరులవేల ॥భూ

సీ. గుడిగూల్చి యిటుకలకొట్టుగట్టిన వాఁడు
విశ్వేశ్వడునె, తిన్నయింటికిఘాత పన్నఁజూ-

న్యాపకృతికి భీతాత్ముఁడగునె, చెలులచుట్టంబుల చెఱిపిన
పాపాత్ముఁడొరుల మాపగిచింతనొందఁగలఁడె, తనవారల
కంగీడు దలఁచిననిర్దయుండి తరబాధను సంశయించఁగలఁడె
తల్లిదండ్రులహింసించు దారుణుండు
దుఃఖపడగలఁడే గురుద్రోహునకు ॥భూ॥

సీ. తల్లిచెవుల్ దెంచ దలఁచినమూర్ఖుండు బినతల్లిచెవి దెంచ
భీతిపడునె, తండ్రినిపస్తుంచితాదిన్నదుర్మతి యాఁకొన్నయ
తిథుల కన్నమిడునె, తమ్ములపాలి విత్తమ్ము మ్రింగుఖలుం
డు పరధనంబుల కాసపడకయున్నె, తనయులపట్ల మాత్స
ర్యమూను దురాత్ముఁడన్య వైరముద్రోహమని తలఁచునె
నమ్మువారినిజెఱుచు దుర్ణయపరుండు
యితరులనుబాగుజేయ నూహించగలఁడె ॥భూ॥

సీ. పైతృకంబునరాత్రి భక్షించు చపలుండు యుపవాసములు
నిష్ఠనుండగలఁడె, యిలు వెడలఁగ తానలయుమాలుగుఁజోతు
తీర్థయాత్రసక్తుఁడిరుగఁగలఁడె, గ్రహణకాలమున మున్గని
మందుడనిశంబు వేడ్క పాత్రిత స్నాన విధికిజనునె, బావికి
కొకన్నయుంపాక మివ్వనిలోభి నిత్యాన్నసత్రంబు నిలుపఁ
తనదుపెండ్లాముసదిమి దీర్చనిబదుండు గ్రగలఁడె
దివిరిమరదంట్రుఁ గోడండ్రఁదీర్చగల్గునె ॥భూ॥

కెడుబిచ్చంబు కొట్టజాలనిదాత యిష్టార్థసం సిద్ధికొవ్వ
చేనిగట్టేదాటలేని గుఱ్ఱమువైరిగిరి దుర్గములకు లం
ఘె, యూరఁబంతిభీతి నొందిపారిన బంటు దాడి
కేటాడఁగలఁడె, కొలుచునారికిజీతములనొసం
యర్థులబిలిచి వెయ్యారులిడునె

బట్టుబాగడనినోళ్ల పూటబత్తెమిడని
యతినికృష్టుఁడుసత్కృతులంగఁగలఁడె ॥భూ.

సీ. అప్పిచ్చియుమ్మలియడుగునాతఁడధర్మ డెగదొబ్బు నాతఁడు తగవుపెద్ద, అడ్డుండి తప్పించు మనుజుఁడుకడిమిండు తంటాలుబెట్టునాతండుసాధు, వెరువిచ్చియడిగిన నరుఁడుదు ర్మార్గుఁడు నమ్మికతిన్న వాఁడార్యవరుఁడు, దాచయిచ్చిన సొమ్ము దలఁచువాఁడవివేకి లేదుపొమ్మనువాఁడు వేదవేత్త
యనుచుతీర్పులు చేసినయట్టిమూఢు
లంతకన్నను గుణవంతులవనిలోన ॥భూ.

సీ. తనదుగరిద్రత్వమునకు నేడ్వఁగనేల యితరసంపద తాసహించలేక, తనయాలు రంభబోయినఁ గృశింపఁగనేల తానన్యసతి పొందుమాన లేక, తనదుశత్రులసాధ్యులని చింతపడనేల యొరులమాపంగఁ దానుడుగలేక, తనపుత్రులవగుణులని మొత్తుకోనేల యొకరిబిడ్డలనీతి కోర్వలేక
యెఱుగనేరని మూఢులకేమిజెప్ప
దీనికిఫలంబు మీఁదనుగానవచ్చు ॥భూ.

సీ. తనతాతనిరతాన్నదాతయంచననేలమునలామెయూళ్ళంట ముష్టియెత్త, తనతండ్రిగారు సద్వ్రత నిష్ఠుఁడననేల తల్లి బల్ జారవ్యసనములుసేయ, తనదుభార్యను వరగుణవతియనఁ గూతురు కులవంపు రీతిఁ గనువ, తనవారలంత సద్ధర్మాననేల చెల్లెలువ్యభిచార్యముల్ సేయుచున్న
తానుతీర్పరినని యభిమానమేల
కొడుకుయొకమూలఁ దెరవాట్లుగొట్టె

సీ. అప్పుబుచ్చుకొని లేదను మొండికొయ్యకు

భావమగునె, గురుజనద్రవ్యాపహరణశీలున కన్యధనము
హరింప సంతాపమగునె, తల్లిదండ్రులను బాధలఁ బెట్టుక్రూర
చిత్తునకు బాంధవపీడ దోషమగునె, పాలించుప్రభువు కపా
యమెంచు దురాత్మునకు మిత్రఘాతయన్యాయమగునె
తనయుపత్నిని రమియించు దారుణునకు
పరసతీసంగమాసక్తిపాపమగునె ॥భూ.

సీ. పుత్రికకే నల్లుఁ బూనఁ బెట్టని మామగారల్లునకు రత్నహార
మిడునె, పనిమాలి కేకూడుఁ బెట్టని యిల్లాలు ప్రాతబంధులకు
విందుసేయఁగలదె, తనతల్లిపట్ల నెనరొప్పని మూర్ఖుఁ బినతల్లి సూ
జ్ఞానీతి మళ్ళఁగలఁడె, తమ్ములకే కీడు తలఁచెడి పాపాత్ముఁ
డొకరి బాగుకుఁ జింత యుంచఁగలఁడె
యిట్టిదుర్మార్గవర్తుల కెవరుచెప్పఁ
గలరు యమరాజు నొకఁడు దక్కంగ జగతి ॥భూ.

సీ. తల్లిని వేరుంచి తమ్ముల విడఁదోలి అక్కచెల్లెళ్ళ సొమ్ము లపహ
రించి, బంధువులను తృణప్రాయంబుగా నెంచి యొరుల మా
నంగ మదినూహఁ జేసి, తనకన్నఁ దెలిసిన జనుఁడెవ్వఁడని గర్వి
ష్ఠియై యుంచుకంతయు ధర్మమోటుఁగ నుండి, లోపల బహువిధ
రాలోచనంబులు జేసి పైకినీతులు పెక్కు బలుకుచుండి
బుధులకొకకీడు సేయంగఁ బూనఁ జూచు
నిట్టిపురుషాధముని జన్మమెందుకొఱకు భూ.

జనద్రవ్యాపహరణాసక్తి యొకటి అన్యసతీసంగమాపే
క్ష, పితృమాతృసద్భక్తివిముఖత్వమొకటి సూత్ర
త్యాగమొకటి, సాధుసజ్జనబంధుజనదూష్యమొ
కటి నిందాపర భావమొకటి, వివిధపండితవర్గ

విద్వేషమొకఁటి మిత్రఘాత్యత్వ ప్రమేయమొకటి
యిన్నియునుగల్గి వర్తింపుచున్నమోట
కొయ్యలకొకళ్లు తీర్పులుచెయ్యఁగలరె ॥భూ.

సీ. తనవారితలవంపు పనులు జేయసహించు పరులు జేసినశప్పు పట్టఁజూచు, తనయింటిలోఁగాని పనికమ్మిఁగోఁజూచు పొరిగింటిపని రవ్వపరుపఁదలఁచు, తనపుత్రిజారవర్తన మాటు పడఁజేయు పరులబిడ్డలరంకు బయలఁబెట్టు, తనకుఁజెల్లిలి దొంగతనములోననడంచు లాఁతివారైన హేళనమొనర్చు
యిట్టిదుర్మార్గులకు యమపట్టణమున
దీనికిఫలంబు తథ్యమైగానవచ్చు ॥భూ.

సీ. వ్యాఘ్రింబులేళ్లఁజంపక మల్లిపోవునె, పిల్లిమానునెకోడిపిల్లఁబట్ట, తోఁడేలుమేఁకలదునుమాడకుండునె, పెనుఁబాముగప్పలదినకయున్నె, కొంగచాపలను గళ్ళుక్కఁనమ్రింగకుండునె, డేఁగగువ్వలనుపీడింపకున్నె, దుంతగుట్టములను దొడరికొట్టకయున్నె కాకిగోరలఁదన్ని కరువకున్నె
ఖలుఁడుసజ్జనులకుఁ గీడుదలఁపకున్నె
కూడదనియెందఱన్న నీక్షోణియందు ॥భూ.

సీ. బాలుడంచును పోట్లపసరంబుపసులునె గుడ్డివాఁడని కాట్లకుక్కఁజనునె, చూలింతరాలని తేలుమన్నించునె మునలిగోవని కాకిమొక్కఁలిడునె, ఫలవృక్షమని గదల్పకపోవునే గాడ్పు భూసురుండని పులిప్రాజలిడునె, పలుకుచిల్కని పిల్లి దలఁచి యూరకయున్నె యీనుచేనని మల్లియొద్దు జనునె
ప్రజలబాధించు దుష్టవర్తనుఁడొకండు
నుజనునకుఁగీడు సేయంగఁజూడకున్నె భూ.

సీ. కంటిలోపల పెద్దకాయ గాచినలాగు కడుపులోపలబల్లి
బొడిచినట్లు, నరములపై గొప్పకురుపు బుట్టినమాడ్కి
పెడతలనొకకంతె పెరిగినట్లు, కాలిలోపలకొట్టు గట్టిగా
దిగినట్టు పొట్టలోపలశూల బొడిచినట్లు, మూత్రరంధ్ర
ములోన ముల్లునాటినయట్లు గూబలోపలపురుగ్గొలికినట్లు
చెడుగుకోడుకొక్కరుఁడు బుట్టిచెడ్డహాని
వానితలిదండ్రులకుసే యువసుధయందు భూ.

సీ. పరిబలశత్రువుల శప్పముదెంచఁ బోలేదు బీదలఁ జంపంగ
పెద్దమొకము, యెదిరించువారి నదేరాయనఁగ లేదు బుధు
లమార్గాన పెద్దపోట్లగిత్త, తన్నవచ్చినవారి దరిఁజేరఁ
గా లేదు సాధులపైకి విస్తారబలుఁడు, తనయిల్లుపున్న్కో
దలఁచువారికి మొత్తుక్కు పరులమాపఁగ బహుసాయవేత్త
హరిహరియిట్టి పాపాత్ములవనిలోన
మన్నుచున్నారు యేమనివిన్నవింతు భూ.

సీ. వీరుపెద్దలటంచు వీరుబంధువులంచు వీరుసజ్జనులంచు వీరు
గురువు, లంచునువీరు ధరామరోత్తములంచు వీరుయోగ్య
లటంచు వీరుసుకవు, లంచునువీరులాచార్య లంచునువీరు
విద్వాంసులంచును వీరుసద్విచారులంచు, వీరుపదమలాత్ము
లటంచు వీరుపూజార్హ పరిచారులంచు
యించుకంతయు మదిలోఁదలంచఁబోడు
దుండగంబునపలుగాకి మొండికొయ్య భూ.

సీ. పులినిఁజంపగ నక్కపోతుగాసినలాగుజలధియీదఁగఁగుక్క
జరుగుపగిది, గరుఁడుని గరువసీర్కట్టి పొంచినమాడ్కి
కొండకోరియఁగ గొత్తెదుమరుకీతి, దంతిలోఁబెనగంగఁబుం

తోఁచియుగమౌశిక్ష వృషభ మడ్డగఁ బిల్లి మొగిరినట్లు, కాలసర్ప
ము మిడిఁగ కప్పచూచినరీతి దీపమార్పఁగ నీఁగ దిరుగుభాతి
ధరణి నధమాధముం డొక్క నరుఁడు కీర్తి
గొప్పవారలతో నెదురొక్కనఁ దలంచు భూ.

సీ. ధర్మంబు లీసమంతయుఁ దల్పఁగా నాస్తి దానమన్నది కలలోన
నున్న, అర్థిపాలనము నవంతఁ గానఁగ వట్టిసత్యవాక్యంబు లేశం
బు లేమి కారుణ్యభావంబు గోరంతయును కల్ల శమదమాసక్తి
కొంచెము హాళికి, స్నానసంధ్యాద్యనుష్ఠానకర్మంబు లెల్ల శై
వవైష్ణవభక్తి తోఁ బోవఁజబ్బ
యిట్టిమూఢులఁ బుట్టించినట్టి బ్రహ్మ
ననఁగవలెఁగాక పిండఁ దిట్టఁ బనేమి భూ.

సీ. అన్యాయవర్తివాని కాధారభూతంబు దుర్బుద్ధివానికిఁ దోఁ
డునీడ, దారుణత్వము వాని తలపైకిరీటంబు పరదూషణము
వానిపంటచేను, అన్యాయవృత్తిఁ బడభ్యసించినవిద్య బం
ధువైరము వానిపట్టుకొమ్మ, పాపహింసాకర్మ వానినిత్య
జపంబు పాపశీలము వాని పాలిసొమ్ము
యముచులోకులు తన్నుఁ దూరుచునుండ
బతుకు మనుజుని కన్న గార్దభము మేలు భూ.

సీ. మహిలోపకార ధర్మము వహించఁడుగాని యసహాయశూ
రుఁడన్యాయవర్తికి, సముచితస్మృతిశాస్త్ర చర్చ సేయఁడుగా
ని పరోక్షవాదములకు మొనటిచెయ్యి, పుణ్యకార్యారంభ
బుద్ధిఁ గాంచఁడుగాని పాపకర్మకు మతస్థాపకుండు, పరలోక
చింతఁ దప్పఁడుగాని ప్రాణిహింసాకర్తయౌదు నిష్ఠాగరిష్ఠుఁ
డనుచు భూజనులిట్లు దన్నుఁ దూరఁగ

నుందుమనుజుండు జీవన్మృతుండుగాఁడె భూ.

సీ. పృథుశౌర్యమున్నఁ జూపింపఁగావలె శత్రుసేనల పైకి వేంచే
యునాఁడు, దృఢవిద్యయున్న వాదింపఁగావలె మహారాజ
ధీర సభాంతరాళమునను, పరకవిత్వంబున్న బ్రకటింపవలె
ద్రోహకారి మూర్ఖులదిట్టఁగాలమందు, అమితధైర్యంబు
న్ననగుపింపవలె మహోఘనవిపద్దశ ప్రాప్తకాలమందు
నగుపరచకున్న చచ్చుపిసుఁగులుగాక
వీరులోకపూజ్యులా పృథివీస్థలమున భూ.

సీ. జారుఁడై దుష్టవర్తనుఁడై పాపవిచారుఁడై బహుదురాచా
రుఁడగుచు, హీనుఁడై మూర్ఖసంతానుఁడై త్యక్తాభిమా
నుఁడై నిరతాపరిమాణుఁడగుచు, దుష్టుఁడై సజ్జనకష్టుఁడై
కోపసందష్టుఁడై నిజకులభ్రష్టుఁడగుచు, క్రోధినియై బంధు
విరోధియై బహుజనబాధియై బుధమనోవ్యాధియగుచు
బరగుచున్నట్టి నిర్భాగ్యనరుఁడు తనదు
పొట్టయిక్కడయగునె యూపయినిగాక భూ.

సీ. మేపినందలము పైకెక్కించినను క్రిందికురుకడి ఫుల్లెల కు
రుకకున్నె, పిల్లిగద్దియఁబెట్టి పూజించిన నుచ్ఛిష్టభక్షణం
బుమఁగగలదె, బలుచక్కెరల యుక్కెరలఁగాకి బెంచిన
గాకుకూతలు కూయఁ గణఁగకున్నె, దున్నపోతుకు మొన్ని
వన్నెలు దిద్దిన బురదగోతులలోనఁ బొరలకున్నె
నీచమనుజుని బుధులుమన్నించి పేర
బిలిచినను వాని గుణముఁ జూపింపకున్నె భూ.

సీ. కనకమాత్రమున్నమధుల కోసఁగనివాఁడు నోరులకల్మికి దుఃఖ
ము. దువాఁడు, సంతతదుర్గుణాచారుఁడై దగువాఁడు వరు

లఁ బాధించఁ బొల్పొందెడువాఁడు, తమ్ములఁ జెరుప యత్నము
దలంచెడువాఁడు బుధులతో వైరంబుఁ బూనువాఁడు, పదు
గురుకాదన్న పనులు జేసెటివాఁడు పరధనంబుల కాసపడెడు
సుకవిజనములతోఁ బోరఁజూచువాఁడు (వాఁడు
దుర్గతినిజెందు నిహపరదూరుఁడగుచు భూ.

సీ. వరుపుహస్తైజను పౌరుషమణగారు కులము గోదావరి కూల
జరుగు, మహిమమర్యాదలు మంటలోఁగలియును చదువులు
సంధ్యలుచట్టువారు, ప్రజ్ఞలుబుద్ధులు పరలోకమేఁగును గొ
ప్పలుకీర్తులుతుప్పకెక్కు, ధర్మమార్గమునీతి నిర్మూలమై
యుండు సకలప్రతిష్ఠలుసన్నగిల్లు
వంశమందునవొక పాపవర్తనుండు
బుట్టుటనుజేసిబుధులకీ భూమియందు భూ.

సీ. గడియలోపల పెక్కు కల్లలాడఁగవచ్చు నాడినమాట లేద
నఁగవచ్చు, అప్పులుయెగదొబ్బి చెప్పకొమ్మనవచ్చు చుట్ట
లచుల్కఁగాజూడవచ్చు, తనవారసకబాధలఁ బెట్టగావచ్చు
మిత్రఘాతుకవృత్తి మెలఁగవచ్చు, యొరులకొంపలు మా
పనూహసేయఁగవచ్చు తనయులనైన బోఁదరమవచ్చు
గాని యమలోక బాధయొక్కటియుఁగడువ
కఠినచిత్తులకదిచేత గాదుసుమ్ము భూ.

సీ. వ్రాసినవ్రాఁతదా వ్రాయలేదనవచ్చు తప్పుజేసుకులోన
దాచవచ్చు, నీతిఁదెల్పఁగబోతె బూతులాడఁగవచ్చు పెద్ద
లుకాదన్న బెనఁగవచ్చు, యింటికేగినవారి నెదిరికొట్టఁగవ
చ్చు కానికూటికి వడిగట్టవచ్చు, పలుగుకొయ్యలమాట
పాటిసేయఁగవచ్చు బుధులవాక్యము త్రోసిపుచ్చవచ్చు

గానికౄరులు యమభటు ఘనగదాభి
హతుల బాల్గొనకయుండ శక్యంబె తెనకు భూ.

సీ. తల్లిబందెలమారి తండ్రియవ్వలముచ్చు జ్ఞాతిబహుద్వేషి
భ్రాతకోపి, మరదలుబహుచండి మామగారవివేకి యత్త
దుర్గుణాగణాయత్తభావ, మరిదితంత్రగొట్టుమనసి కోడలు
మంకు భార్యగయ్యాళి నిర్భాగ్యుబావలు, చెల్లెలుగడుదొం
గయల్లుఁడు కూళపుత్రుఁడు దుర్గయుండు
కూతురుపిపాళి. అందరికి పెద్దకార్యాగ్రగుడరయుతాను
యిట్టిపురుషాధముని జన్మమేఁదుకొఱకు భూ.

సీ. కన్నగారికి జూజగాఁడుమిత్రుఁడు మద్యపానవృత్తికి కుల
భ్రష్టుగురుఁడు, పరమలోభికి ములభపుఁడంతనిపతి గుణహీను
నకుపల్లుకొయ్యతంత్రి, ధర్మశూన్యునకు కృతఘ్నుండుచు
ట్టాలు మొండివానికిమూర్ఖయుంతకొడుకు, కర్మబాహ్యున
కు సంకరకులుంపొప్పుంకు దొంగమకుండకు లంజతోడునీడ
యగుమనసొత్రస్య సంబంధమామరియున్న
యిట్టివారలెసిరి గాంచికీర్తిదిత్రి భూ.

సీ. తండ్రిదూషించి పెద్దలనుతింపఁగ నేల తమ్ముల్రఁజెరిపి ధర్మమ్త్ర
మేల, తల్లినిదన్ని బాంధవపూజనంబేల మిత్రునివిడిచి పై
మేళ్ళేల, గురునినిందించి భూసురులవేడఁగ నేల బిడ్డనమ్మి
యొకంద్రపెంచ నేల, యాశ్రితునటుదోలి యర్థరక్షణమేల
నిలిమిటిదిట్టి దైవనుతియేల
మెఱుఁగనేరని మూర్ఖులకేమిచెప్ప
తెలియబడవచ్చు యమసభాస్థలమునందు భూ.

ఊళ్లుదోచుకు రాతిగుళ్లుగట్టఁగనేల యిల్లుబుచ్చుకు తోటలే

యానేల, ప్రజలఁబీడించి ధర్మము సేయఁగా నేల దాసులఁగొట్టి
సువర్ణదానమేల, మాన్యముల్ కబళించి మఖము సేయఁగ
నేల సాధులఁజెరిపి పైశాంతు లేల, బంధులసొమ్ము హరించి
భూరియివ్వఁగ నేల పురములుగూల్చి గోపురము లేల
యిందుకు ఫలంబు దేహాంతమందె తప్పు
నెఱుకబడుగాక కూళలకేల చెప్ప భూ.

సీ. బురదగోతులలోన బొరలాడు పందికి సారచందనగంధచ
ర్చయేల, పరగళ్ల వెంబడి దిరుగుగాడిదకి విశాలమందిర ని
వాసంబు లేల, బయలుపుల్లెలునాకి బ్రతికెడుకుక్కకు స
రసాన్న భక్ష్య భక్షణము లేల, యడవుల చెట్లెక్కి యాడుకో
తికిరత్న సౌధాగ్రసీమ సంచారమేల
మూర్ఖజనునకు సతతప్రమోదకరణ
సాధుసజ్జనగోష్ఠి ప్రసంగమేల భూ.

సీ. పదుగురుమెచ్చి శాబాసునన్నదిమాట నడిమ్రొగంబుల జి
క్కువడినమాట, వ్యాఘ్రసింహముల నుక్కణగించునదివో
ట గాఢఫలోత్కృష్టమైనతోట, సిందుగాబహుజనులుం
డునదేపేట యిల్లాలుగల్గుట యింటికితేట, పరులచే సాధింప
బడకయున్న దెకోట పదివందినడచు చున్నదియ బాట
విన్నవారికి హృద్యమై యున్నపాట
కన్నవారికిఁ జిత్రమైయున్ననాట భూ.

సీ. కలిమెంతగలిగిన దొలఁగవాపత్తులు తమకెన్నివిధముల దఁ
న్నుకొన్న, తపమెంతగలిగిన తప్పదుకర్మంబు తోచకతమ
రెంత దుఃఖపడిన, చదువెంతగలిగిన వదలదుదారిద్ర్యమూ
రకె తమరెన్ని యూళ్లుజనిన, బలమెంతగలిగిన బాయదువ్యా

ధులు తమయమెన్నో యుపాయములున్న
యనుభవంబులు దప్పించుకొనఁగ శక్తి
గల్గునే స్వామి నీయనుగ్రహముదక్క భూ.

సీ. కలిమెంతయున్న బీదంటఁ జెప్పగావద్దు విద్యయెంతున్న గద్దిం
పవలదు, ధనమెంతయున్న మత్తతవహింపగవద్దు దాంత
నం బెంతున్న త్రుళ్లవద్దు, వీర్యంబదెంతున్న విఱ్ఱవీఁగవద్దు
తపమెంతయున్న క్రోధంబువలదు, బలమెంతయున్న దుర్బ
లున దెంతనవద్దు ప్రజ్ఞలెన్నున్నఁ జెప్పంగవలదు
సాటిఁజెప్పినయీ మాటపాటిఁజేసి
యున్నమనుజులుబహు కీర్తినొందఁగలరు భూ.

సీ. పరవంచనాబుద్ధి పాటిసేయగవద్దు విబుధులతో గోష్ఠివిడువవ
ద్దు, యుపకారికపకార మూహసేయఁగవద్దు అన్యులనిందో
క్తులాడవద్దు పెద్దలుతగవుజెప్పిన ద్రోహముగావద్దు పరుల
బాగును చింతపడఁగవద్దు, పలుగుకొయ్యలను చేపట్టియుండ
గవద్దు శివవిష్ణు దూషణల్ చేయవద్దు
యిదియెఱింగని కూళలకేల చెప్ప
తెలియఁబడవచ్చు యనుసభాస్థలమునందు భూ.

సీ. ఆత్మకన్యావిక్రయాస కునకు మరి దూషకుండగు కూళ
దుండుదలఁప, పదయుగ ఘోళనా భావభోజికి దురాచారుఁ
డైదగు శిరసన్న నరతుండు, విప్రవర్గక్షేత్రవిత్తహారికి య
పరాధియాన గ్రహారప్రదాత, సతతసంధ్యాకర్మ సంత్య
క్తునకు మహాశఠుఁడునో యజ్ఞదీక్షాపరుండు
యహహ యీ కలికాల మాహాత్మ్యమరయ
వింతయైదో చెఁగద ధరాభ్యంతరమున భూ.

సీ. రణభీరువునకు దారుణభయంకరైతోఁచు పరిబలసంగ్రామపరి
వర్తకుండు, ననృతభాషికి నసహ్యాలాపుఁడై యుండు ఘనత
రసత్యవాక్యవర్తుండు, జడమానసునకు పేరిఁడిగాయవ
లెనుండు సరసనకోఁటికిత్తు పరిసంగశాలి, పాపకారికిదుష్ట భావ
నుఁడైదగు పుణ్యకార్యారంభ బుద్ధిచరితుఁడ
హాహాయీయుగధర్మంబు లరయదరమె
యిట్టిగుమతులె సుజనులనెన్నుచుందురి భూ.

సీ. చందనగంధంబు చర్చసేయుటదొడ్డ బురదదాల్పదె దున్న
పోతుమేన, బంగరుతగటిదుప్పటి గప్పగొప్పానె గంగిరెద్దు
కు లేదె రంగుబొంత, రమణీయ రత్నహారముఁదాల్పయొకసీ
టివేసగానికి లెవింతపేస్లు, ఘనతరంబగుసొమ్ము గణియిం
చపరిభ్రానె వారకాంతకు లేదె భూరిధనము
వైభవంబునకివిగావు వరుసలరయ
అమితదానయశః పరితాపములుగాని భూ.

సీ. కన్నబిడ్డలఁజంపగణగఁజూచినయది తల్లిగాదొకవిషవల్లిగా
ని, తలిదండ్రులకుహానిఁ గలుగజేసినవాఁడు కొడుకుగాఁడొక
పెద్దపడుకగాని, తనయులనందందఁ దరమికొట్టెడువాఁడ
తాతగాఁడొక యమదూతగాని, తమ్ములఁజెరుప యత్నము
చేసెటివాఁడు యన్నగాఁడొక మోటదున్నగాని
తినదుదాయాదులను బోరివదలఁపజేని
నరుఁడుగాఁడతఁడు వానరుఁడుగాని భూ.

సీ. కాయంబుమృదుగతి కంకటిమెరుగునే పుష్పవాసనచీడ పు
ర్వుగనునె, పాయసరుచితెడ్డు బద్దరిహించునె తేనెతీపినిసి
ద్దితెలియఁగలఁదె, సానచందనగంధ సౌరభ్యమెఱు,

సూత్రించుమహాకీర్తి శుద్ధిగనునె, జలముమాహాత్మ్యంబు
దెలియఁజాలునెకప్ప యడవియోషధి సత్వమరయఁగలదె
తులువమానిసి పెద్దలఁగలిసియున్న
గాని వారిగుణంబులు గాంచఁగలఁడె భూ.

సీ. ఎలుకలఁజంపి పిల్లులకుఁబెట్టించి గుడ్లలకునుమాడి సాళ్వ
ములఁ గొసఁగి, కప్పలఁబట్టి నీరుకట్టెలకొప్పించి లేళ్లఖండిం
చి తోడేళ్లకిచ్చి, బలుదుప్పులనుదుత్రించి పులులముందటఁ
బెట్టి బక్కల నక్కలపాలుచేసి, ఫలవృక్షవనము కట్టెల
కిందజారిచ్చి పొట్టచేలోఁకసి యాంబోతుమేపి
నట్టితమవంటి ధర్మాత్ములవనిలోన
గలరెయని మోలకొయ్యలుఁ బలుకుచుంద్రు భూ.

సీ. గడుపిశాచమురీతి నెడపకభక్షించి గాత్రముసూకరమట్లఁ గ
డుపు పెంచి, గాడిదెచికి ంను గతిఁవళ్ళికించి గొప్పయాఁ
బోతులాగున మదించి, ముదికోఁతిలాగున మొకముబిడా
యించి వరఁడుపోలికె యిక్కవలుగపించి, దున్నచొప్పున
పెద్దపిన్నలఁ దోలగించి తలపుచు ఘకంబు గతిచరించి
మించితాఁ బెద్దనంచు గర్వించియున్న
హీనునకు కీర్తిగల్గునా యెంచిచూడ భూ.

సీ. కౌటిల్యమెక్కువ కార్పణ్యమధికంబు మాత్సర్యమురవు
దుగ్ధదమ తరుచు, కోపంబుగాటంబు కూర్రత్వము ఘ
నంబు గర్వంబులావు ముష్కరతదొడ్డ, దారుణత్వము
పెల్లు దార్ఘ్యమతిగొప్ప జారత్వమెచ్చు దౌష్ట్యంబుపెక్కు
చాంచల్యగుణము విస్తారంబు చాపల్యమతిమాత్ర మన్యా
యగతిసమృద్ధి

గలిగివర్తించు పాపచిత్తులుహసించి
యెగ్గులెన్నుదు రార్యుల సిగ్గుమాని భూ.

సీ. సదమలస్తుత్య వంశమునకు దౌర్జన్యకారి హీనునిబెద్దగాన
మర్చి, సంతతసాధు నిశ్చలపుణ్యవర్తికిఁ బలుగుగ స్వైరిని
భార్యఁగూర్చి, బహుధర్మకీర్తి తత్పరునకు దుర్నయాకరుమూ
ర్ఖుఁ దనయునిగానొనర్చి, సగససౌందర్య లక్షణకళావతికి
ముష్కరకురూపుని భర్తగాఁగుదిర్చి
అబ్జభవుఁడు తదీయపూజ్యత్వమెల్లఁ
బనికిరానియ్యడవి యేమిపాపమొక్కొ భూ.

సీ. కొండంతవిత్తంబుఁ గూడఁబెట్టిననేమి దానహీనుండైన
మానవుండు, నిఖలవిద్యాభ్యాసనిపుణుఁడైననునేమి యమిత
దుర్గర్వాంధుఁడైనమనుజుఁ, డురుతరసంపత్తుఁ గాదవియుండిన
నేమిదీనతపోశూన్యుఁడైనజనుఁడు, బహుకాలమాయువుబ
డసియుండిననేమి యపకీర్తిభాజనుండైననరుఁడు
యిట్టివారల గొప్పలనెన్నుచున్న
పురుషునవివేక మెంతనిఁ బొగడవచ్చు భూ.

సీ. చతురంగబల సముద్ధతినిగ్రాలిననేమి యూసన్నరక్ష సేయని
నికృష్టుఁ, డిద్ధరాతలమంత నేలుచుండిననేమిబుధులఁబోషిం
చని మూర్ఖచిత్తుఁ, డన్యదేశంబుల నాక్రమించిననేమి వి
జయూర్తిశాపిఁ బోవనిఖలుండు, బిరుదుటెక్కెంబులు పె
ట్టఁబూనిననేమి శరణాగతులను బెంచనిదురాత్ము
డిట్టివారల సౌభాగ్యమెందుకొఱకు
వీరిఁగొనియాడఁ బోడపన్మూర్ఖరిగాని భూ.

సీ. ప్రభువాజ్ఞఁగొలఁదియే ప్రజలమర్యాదలు పతిశిక్షఁగొలఁది

యే సతిగుణమ్ము, భాగ్యంబుకొలఁదియే బంధుసన్మానంబు
తిండికొలందియే దేహపుష్టి, మాతతీర్పుకొలంది కూఁతురున
డవళ్లు నేలమంచికొలంది చేలపంట, గురుబోధనాప్రౌఢికొ
లఁది శిష్యుల తెల్వి తండ్రిరీతికొలంది తనయువృత్తి
గానియెక్కువ తృణమంతగలుఁగఁబోదు
తోచకూరకె చింతించిదుఃఖపడిన భూ.

సీ. తిండిపోతుకుఁగూటి కుండయందునెభ్రాంతి దురితాత్మునకు
గురుద్రోహచింత, కామాతురునకన్య కాంతారతాసక్తి
పలుగుకొయ్యకుఁ గానిపనులతలఁపు, పాపకారికిసజ్జనాపకా
రవిచార మతిహీనగుఁశకి నీచానురక్తి, కుటిలచిత్తునకు స
ద్గోష్ఠిజనద్వేష మతిధనాకాంక్షి కన్యాయబుద్ధి
బాయచెప్పఁడు నారటపాలికర్త
మొట్టిదియొకాని తొలఁగరాదెవరికైన భూ.

సీ. దుర్బుద్ధిబలుఁడైనఁ దొంగగుసాపత్రి కృపణాత్వమొదవినఁగీ
ర్తిమల్లె, నన్యాయమెచ్చిన నధికారమూఁతను మదముదట్టి
నఁజనుమార్దవంబు, జారత్వమెచ్చిన సన్నగిల్లువరిష్ఠ కు
టిలత్వముర్వైన గొప్పచెడును, గర్వంబుతరుచైన గౌరవం
బుఁదొలంగు దరిద్ర్యాసపెల్లైన ధర్మముడుగు
యివియెఱుంగక వర్తించుహీనజనులు
పనికిరాకుందుదురు గడ్డిపరకకైన భూ,

సీ. పరిభవపుమర్గయుఁడైన పరిజనులుజేసినకర్త పతిపరకుండైన
భార్యకర్త, అర్ధానికుఁడు లోభియైన నర్థులకర్త కరణము
చెడుగైన కాపుకర్త, తండ్రికుచ్ఛుఁడైన తనయుపర్గము

కర్మ తల్లినిర్దయుఁడైన పిల్లకర్మ, క్షితిచిక్కఁజేరినచేని
యాతనికర్మ కుటిలుఁడైననరుండు కులముకర్మ
గానివారలదుష్కర్మ గామతలఁప
మెలఁగనేగకవారి నెగ్గెన్న రాదు భూ.

సీ. కవిజనంబుల కుపద్రవముఁ దల్చుటముప్పు బలవంతుతో
వైరపడుటముప్పు, దేశాధిపతిని నిందించఁ బూనుటముప్పు
గ్రామాధికారితోఁ గలుముప్పు, చెడి చుట్టమింటికిఁ జేరఁబోవు
టముప్పు కొదుగులతోఁ బొందు చేతముప్పు, భార్యకుఁ జనువి
చ్చి పాటిసేయుటముప్పు పదిమందికాదన్న పనులుముప్పు
కొండెకొయ్యలమాట నమ్మ్రోనిబుధులు
పాడుతంటాల పనికడ్డపడుటముప్పు భూ.

సీ. పరమమూర్ఖుండైన సరసాగ్రగణ్యుండు శుద్ధజడుండైన
బుద్ధిశాలి, సంకరకులుఁడైన సంపూజనార్హుండు యవివేకి
యైన విజ్ఞాన్వితుండు, గడుపందయైన పక్రమశౌర్యధు
ర్యుండు మలభక్షకుండైన మాన్యగుణుఁడు, పరమభాష
ణుఁడైన బహువాక్యచతురుండు ధర్మశూన్యుండైన తగవు
యనుచుబొంగడిక గాంతురీయవనిమెంతి (పెద్ద
హీనులైనను వ్యవహారములనియున్న భూ.

సీ. సాహసౌదార్య పౌరుషశాలియాతఁడు పావనవంశ సంభవుఁ
డతండు, నిఖిలవిద్యాభ్యాస నిపుణుఁడాతఁడా మహాదానశ
శాధురంధరుఁడతండు, అంచిత చతురుపాయజ్ఞుఁ డాతఁడు
బుద్ధికుశలుఁడాతఁడు పూజ్యగుణుఁడతండు, సదమలకీర్తివి
స్తారుఁడాతఁడు భవ్యసరససౌందర్య లక్షణుఁడతండు
మొఃసిద్ధాశ్రిఁ బదిపల్లెలేలుచుండు

నలఁడుసర్వజనోత్తముండనఁగఁబరగు భూ.

సీ. కుక్షింభరుని బుధరక్షావరుఁడంచు నతినికృష్టునిమహాత్యా
గియనుచు, బహుబీజసంభవుఁ బరమపావనుఁడంచుఁ జంచ
లాత్ముని ధైర్యశాలియంచు, దౌర్జన్యకారిని ధార్మికోత్త
ముఁడంచుఁ గఠినచిత్తుని దయాకరుఁడటంచు, జారకర్ముని ప
రదారవర్జితుఁడంచు, నుత్తమాధముని శాస్త్రవేత్తయంచుఁ
గవులుకక్కుర్తి చేతను గడుపుకొఱకు
సన్నుతింతురుమదిలో విచారపడక భూ.

సీ. పండితశ్రేణికిఁ బ్రబలమాత్సర్యంబు ఘనకవీంద్రులకుయా
చనగుణంబు, భాగ్యవంతులకు వైభవమదోద్రేకంబు స
త్కులోద్భవులకు జారవృత్తి, ధరణీసురులకు సత్కర్మనా
పేక్షిత విద్యాధిపులకు దుర్వ్యసనయగరిమ, నరనాథులకు నీచ
పురుషసాంగత్యంబు తాపసోత్తములకు, దామసంబు
నలువగల్పింపడేని తన్మహిమఁబొగడఁ
దరమెయెవ్వరికైన యుద్ధాత్రియందు భూ.

సీ. కలిపురుషప్రీతి కారులైదగుమోట పశులగావరులు భూపా
లులైరి, చెడుగుకొండెలకెల్ల బొడమినగడుత్రొత్తుకొడుకు
లుదారులైరి గురుతుదనర, జారచోరులు దురాచారులన్యా
యపరిచారులు ప్రబలులై గెరుచుండిరి, మాలలుతమ్ముళ్లు
మంగళ్లనంబులు బలువెజ్జులైరిభూతలమునందు
నౌరయీయుగధర్మంబు లరయమదికి
విస్మయకరంబులై గనుపించుచుండె భూ.

సీ. పలువురుఛీయన్న పనులు పెక్కొనరించి పలుమరుపరుష
భాషలువచించి, పూటపూటకు మాంసపుంజముల్ కబళిం

చితనవైభవమున మాత్రతవహించి, పలుకొంటెలను పెద్దల
జేసిమన్నించి బుధసంగతి కసహ్యబుద్ధిగాంచి, అన్యాయ
మున విత్తమార్జనఁగాంక్షించి పెల్లుగాఁదిండిచేయొళ్లఁబెంచి
యుంచుకొంచియు సద్వృత్తిమెఱుఁగనట్టి
హీనునకుఁబౌరుషము గద్దియెంచిచూడ భూ.

సీ. అంగడంగడ విచ్చమడిగివేసాల్ వేసి జాబులుదెచ్చి పైజా
ర్లుబట్టి, బాజార్లుదుడిచి సవారీలుమోసి గుర్రాలమేపియు
గుడిరాళ్లదివ్వి, పాగచుట్టుంబీల్చి గంగంపుచానలయిళ్ల
కావలియుండి మెఱుకసెప్పి, పశువులగాసి తెప్పలుదీసి ముం
డలదార్చి లంజలకుఁబాదంబులొత్తి
పాట్లఁబడిమీఁద దొరయైన వాఁడుధర్మ
నీతిమార్గంబు నడువగానేరగలఁడె భూ.

సీ. ప్రజలనందఱబాధ పరుచుటకై బుట్టి యాచకాళుల దిట్టియ
వలగొట్టి, సరసమహాకవీశ్వరులకెగ్గులుగొట్టి కొంటెల
నలుగురఁగూడగట్టి, పూర్వప్రశస్తులు భూమిలోనికిమొట్టి
పండితోత్తముల రాకుండఁబట్టి, బీదలకు మనవిదెల్పిన మా
ర్గముగ మువెట్టి ప్రజలసంపత్తి గర్వమునదొట్టి
నట్టికూరిరన్నపాలుఁడు గట్టిదనము
దిట్టముగ భవ్యకీర్తి చే పట్టఁగలఁడె భూ.

సీ. పలుగుగయ్యాళి దెబ్బలగండుపాలుగాడి మాలుగఁబోతు
బల్మాయ లెడి, పిశినిగొట్టుపిసాళి పెంకెబొంకులపుట్ట చెడు
గు నిక్కులయిక్క చెనఁటిపాంతు, టకుబాజుకల్లరి టాటో
టుగదుమోట బందెలపుట్టిల్లుయుందగత్తె, రంతులరాట్టంబు
రవ్వలమారి తంటాకోరు రంతులరావుముచ్చు

యిట్టి శృంగారంపు పెండ్లాము నేలుచున్న
నరుని సౌభాగ్యదశ యెన్న నొరులవశమె భూ.

సీ. దానధర్మవిధాన విహీనమానసురాలు సకలమానవా వా
దజన్మురాలు, గుణితరాశేక దుర్గుణ గణాన్వితురాలు బ
హుజనోపద్రవ సహితురాలు, భూతభేతాళ పరిభూతభీక
రురాలు సతతాన్యనిందా విచారురాలు, భూరికోపవికార
భావదారుణురాలు పరజనద్రవ్యాపహరణురాలు
యెన్నటువంటి పెండ్లాము నేలుచున్న
పురుషుని యభాగ్యమెంతని బొగడవచ్చు భూ.

సీ. కులుకుమిటారి పూవిలుతుచేతికటారి బంగరుబొమ్మ క
ప్రంపుదిమ్మ, యన్నులమిన్న చిన్నిసంపెంగగున్న గో
ముసదుదీవి గుజ్జుమావి, వన్నెలదొంతి మవ్వంపుపువ్వుల
బంతి రతనాలతేట నరాలమూట, వందువెన్నెలసోరు బల
మానికపుతీరు వలపులమొలక మేల్ తలుపుచుక్క
యనగ నెనగియున్న చెలిగూడి యలరుచున్న
పురుషునియదృష్ట మెంతని బొగడవచ్చు భూ.

సీ. గమనగమవంచు చక్కనిమల్లెపూచెండు తమ్మివాల్గొమ్మ
చే పిమ్రపండు, నిగనిగలాడు బల్సొగసు కల్వసరంబు
రంగారు బంగారు సింగారంబు, చకచకలీను మానికెపుతీ
రు సలాకనీటొప్పు కప్పువన్నెటివాక, మిలమిలమెఱయు
క్రొమ్మించుమించులతీరు తెలతెలల్ చూపు ముత్యాలకోవ
యెన్నయిటువంటి లేయన్నుమిన్న దొరకు
మున్ను నిన్నుమతుల్ గొన్నయన్నరునకు భూ.

సీ. చిరతరసౌభాగ్య గరిమపార్వతిపోలి వరభోగములశచీ త

రుణిఁగోలె, బహుతరోత్కృష్ట సంపదనిందిరనుబోలె చతుర
మంజూక్తి భారతినిబోలి, రూపవిభ్రమ కళాసమాఢ్యనిరతిఁబో
లి సంతతక్షమను భూకాంతఁబోలి, భూరిపాతివ్రత్యమున న
రుంధతిఁబోలి ఖ్యాతిసంతానాప్తి నదితిఁబోలి
వెలఁగుచున్నట్టి యిల్లాలుగలిగెనేని
పురుషమణి పుణ్యమెంతని పొగడవచ్చు భూ.

సీ. సుదతులమురిపెంపు సొలపుపాటలకును ననబోండ్లచిన్నారి
నగవులకును, మగువలగడితంపు సొగసుచైవులకును యు
విదలగదువింత యొప్పులకును, చిలుకలకొలికుల చిన్నెవ
న్నెలకును నతివలదగ్గ యొయ్యారములకు, మొలతలసీటారు
మేలుకోపులకును చెలియలబలితంపు చెలువములకు
బలునిరాబారి పెద్దలేవలసిత్రాల్లి
జిక్కురనివించు యొరులకుఁజెప్పనేల భూ.

సీ. భామలచెలువంపు మోముఁదమ్ములకును నబలలేజెక్కు
టద్దములకు, కాంతలసిబ్బెంపుఁ గిబ్బిగుబ్బలకును నంగనా
మణుల నూఁగారులకును, కలికింతకంఠుల కమ్రవాతెఱలకు
సుందరాంగుల వాలుఁజూపులకును, పల్లవపాణుల మెల్లని
నడలకు మందయానలముద్దు మాటలకును
గాంచిపులకించి ధృతిసంచలింపకుండ
నిలుపఁగాశక్యమానె యోనలువకైన భూ.

సీ. ఒకమారువాసంత పికవధూకాకలీధ్వనిఁదృక్కంఠ నా
దములమించి, యొకమారునిర్మల పరిస్ఫుటశరచ్చంద్ర చం
ద్రికా రుచిరహాసములనెరపి, యొకమారునిశితదర్పక ధను
ర్జ్యాముక్తశర జాలనిభకటాక్షములనించి, యొకమారురత్న

కందుకచారు కుచలసత్కాంతు లొక్కించుక గానుపించి
తరుణులెంతటి ధీరుల ధైర్యమెల్లఁ
జూఱగొందురు కన్నెత్తి జూచిరేని భూ.

సీ. ఒకమారు కెమ్మోవి యొగపురాణింపంగ సూటిమీటఁగ
చిన్నిపాటపాడి, యొకమారుఁగుబ్బల యుబ్బునసడలిన ప
యిటయెల్లనె పొందుపడఁగఁదిద్ది, యొకమారుగడితెంబు టొ
య్యారములు దోపఁగిలకిలమనుచు నవ్వులనుఁజొక్క, యొ
కమారుతేనియ లుట్టిపడ్డటువలె జిలిబిలిముద్దు పల్కులవఁ
చెలియపేరిత పురుషుల జిత్తములను (నర్చి
గరుగజేతురు భృత్యులు గాఁగతమకు భూ.

సీ. అన్నదమ్ములు కర్మనాని మొత్తుకొందురు అక్కచెల్లెండ్రు
హాయనుచనుండ్రు, చుట్టాలుపదుగురు చుల్కఁగాఁజూతు
రుతల్లిలోలోపల ద్రుళ్ళుచుండు, జ్ఞాతివారలుచాల చప్పట్లు
గొట్టుదురు వదినెగారులు దెప్పగదముచుండ్రు, యిరుగుపొ
రుగుల రు యిండ్లకు రానీరు పెండ్లిండ్లకైనను బిలువరె
శ్రీహరిదాంగ తనమొంత చెడ్డతప్ప (వరు
యెంచఁగా నాఁడుదానికి యేదిలెదు భూ.

సీ. తలక్రిందుగాను వేదముఁజెప్పఁగావచ్చు బహుమంత్రసి
ద్ధులుఁ బడయువచ్చు, సకలశాస్త్రములు ప్రసంగించగావ
చ్చు తీర్థయాత్రసక్తిఁ దిరుఁగవచ్చు, సతతోపవాస నిష్ఠ
లుగాంచగావచ్చు సర్వపురాణముల్ చదువవచ్చు, నృత్తగీ
తాములన్నియు నేరఁగావచ్చు నఖిలగారుడవిద్య లాడవచ్చు
గానిదారిద్ర్యబాధ యొక్కటియుఁగదుప
శక్తిఁగలుఁగదు యేలాటిజనునికైన భూ.

సీ. క్షితినాథుచేత తాజీవమందఁగవచ్చు బుధులచే మన్ననఁ
బొందవచ్చు, జనులలో బహుయోగ్యుఁడను పించుకొనవ
చ్చు బుధులలోపలఁ గొప్పఁబొందవచ్చు, జ్ఞాతులచే మహా
స్తవముఁబొందఁగవచ్చు కులములోఁ బెద్దయై మెలఁగవచ్చుఁ
బరులచేఁబాదముల్ పట్టించుకొనవచ్చు వీరులలో ఖ్యాతి వ
నవనిలోపల యెట్టివాఁడైనగాని (లయవచ్చు
యంచితంబుగ పడికాసుఁబ్బియున్న భూ.

సీ. ఉదయాస్తమయముల నోగిసద్రిగినవాని బలువరుకొం
డెముల్ బలుకువాని, సతతంబుపరుషభాషలు వచించెడి
వాని యన్యాయవర్తనుండైనవాని, బహుగర్వియైన
భాగ్యఁగూడనివాని మలినదానీ క్రీడనలుపువాని, కోఱగా
నిసంకరములుల గూడెడివాని కానికూళ్లను వడిగట్టువాని
క్షితినియిటువంటి జనునిలక్ష్మికిటా తు
మూనదరయఁగ యించుకంతైనగాని భూ.

సీ. తనుఁదాను నుతిఁజేసుకొనెఁడువాఁడొక మూర్ఖు వలకన్నవ
నిసేయువాఁడు మూర్ఖు, పలుగుపెద్దామఁ జేపట్టువాఁడో
కమూర్ఖు చాడిచెప్పఁగఁ బూనువాఁడుమూర్ఖు, తనకన్నఘ
నుఁడులేడనెఁడు వాఁడోకమూర్ఖు వసితఁజను విచ్చువాఁ
డుమూర్ఖు, కోఱఁగానివారల గూఁడువాఁడొకమూర్ఖు వ
లుగాకివలె పేలువాఁడుమూర్ఖు
దనరితనవాండ్రు జేసినతప్పువనికి
మోదమలరేఁడు వాఁడొకమూర్ఖుసుమ్ము భూ.

సీ. దుర్గయోదోగ్యకిఁ బూర్ణాయువదిసున్న కుటిలచిత్తునకు న
ద్గోష్టిసున్న, పాపచిత్తునకుఁ బరమార్థమదిసున్న కూ్రిత

తుష్టునకు సాధుగుణముసున్న, సజ్జనద్వేషి కీశ్వరసహాయ
మునున్న జ్ఞానహీనునకు మోక్షంబునున్న, ధర్మహీనునకు
నుత్తమలోకగతిసున్న కామాంధునకుఁ బుణ్యకర్మసున్న
బహుసురాచారుఁడై పరఁగుచున్న
జనునకీద్ధరమా కటాక్షంబుసున్న భూ.

సీ. వచ్చినయపకీర్తి చచ్చినపోవదు తీర్చిపుచ్చఁగ నవ్వతీర
దెప్పుడు, చేసినకర్మంబు చెల్లదుకుడువక చావుదప్పదు
యెంతజడిసియున్న, దేహాంతమునగాని తెలియవుదసపా
ట్లుజననిందకంటెనుచావుమంచి, దైవంబుతన్నుమాత్రమె
బ్రోచుచుండును పనుగుమాట తప్పదుధరిత్రి
నెంతబలువైనదొర నాశ్రయించియున్న
గలుగనేరదు భాగ్యహీనులకుమేలు భూ.

సీ. తనవారులాతివారని భేదమరయఁడు దివిరియాపదల నొం
దించుటకును, శత్రుమిత్రులయందు సమమైనబుద్ధిగాశిక్షిం
చుచుభంగించిఁజెనపుటకును, ఉపకారినపకారి నొకరీతిఁగాఁ
జూచి గావించునెంతటి ఘోరమైన, గురువునుదైవ మేకో
భావమనుకొని దోడరిచేయును యెంతద్రోహమైన
అనుమసీకెతి జనులుతన్నాఁడుకొనఁగ
బ్రతుకుమనుజుండు జీవచ్ఛవంబుగాఁడె భూ.

సీ. పెద్దతవ్వపేరఁ బిలిచిమాటాడకు భార్యయెప్పుడు తూల
బలుకుచుండు, బంధువుల్ నలుగురు పాటిసేయఁగఁబోరు త
నవారలంత ఛీకొడుచుచుందురు, పరమార్థసాధనోపాయ
కర్మమడంగు నిల్లునొళ్ళునుఁగూడ గుల్లయగును, అంటిపొం
దినవార లందఱుతేలికబట్టి బల్ గెగ్గిలు గొట్టుచుందు

తవనిలోపల జారత్వమరయహాని
యెంచిచూచిన బుద్ధునికేది లేదు భూ.

సీ. పితృమాతృలను మనః ప్రీతిగా మెలఁగుము గురువులపై భ
క్తిఁ గుదుముకొలిపి పెద్దలగనిచాల ప్రేమపూరింపుచు దీను
లఁ బోషించి తెలివెలిఁగి, బంధువిధేయుఁడై బహుజనమిత్రు
డై సాధుసజ్జనగోష్ఠి సలుపుచుండి, పరకాంతలను మాతృ
భావంబుఁగాఁజూచి సంతతధర్మప్రవర్తనుఁడనుచు

మెలఁగుచున్నట్టి వాఁడెపో దలప భవద
ఖండ కారుణ్యమునకుఁ బాత్రుఁడౌను సుమ్ము
భూమిసురవర కోలంకపురనివాస
మదనగోపాల రాధికా హృదయలోల.



శ్రీ

## —ఆంధ్రభాషావిలాసిని—

——:o:——

ఇదియొక తెలుఁగు మాసపత్రిక,

పత్రికాధిపతి, కావ్యనిధి,

శ్రీ చలికాని లచ్చారావుగారు

ఇందు సుప్రసిద్ధకవులు రచించిన పద్యకావ్యములు, గద్యకావ్యములు, నాటకములు, శతకములు, పూర్వకవుల యముద్రితగ్రంథములగు పురాణప్రభృతులు ప్రకటింపఁబడుచుండును.

సంవత్సరమునకు చందా 2—0—0 లు మాత్రమే.

——

వలయువారు, కార్యదర్శి,

ఆంధ్రభాషావిలాసినీ కార్యస్థానము,

చిత్రాడ,

పిఠాపురంపోస్టు, గోదావరిజిల్లా.



శుభమస్తు.

# శ్రీ వేంకటాచలనిలయశతకము.





రమణీ హృదయాబ్జ వి
హారా పరమేష్ఠి శంకరాఖండల బృం
దారక వినుతాచారా
హార యశస్సార వేంకటాచల నిలయా.

శారద బుద్ధివిశారద
పారద పరిశుభ్రవర్ణ బలపిమదీయా
దార వచనరచనా సువి
హారిణియాంగాత్ర వేంకటాచల నిలయా. 2

మృత్యుంజయు ప్రియతనయుఁడు
ప్రత్యూహము విఘ్నరాజి బలమడిపి సదా
కృత్యాద్యంతము లరయుత
మత్యుత్తమ లీల వేంకటాచల నిలయా. 3

ఈశుఁడు సంతతవినత ది
గీశుఁడు వరసిద్ధసాధ్యగీర్వాణ కృపా
వేశుఁడు పరమేశుఁడు న
న్నాశుగతిం బ్రోచు వేం. 4

పరమేష్ఠి పరమదయతో
చిరజీవమొసంగి రక్షసేయుత మని యా
దరమున వినుతించెదఁ గర
మరుదా వాఙ్నియతి వేం. 5

నిను నమ్మి కొలుచు జనముల
కనుపమ చిరసౌఖ్యదాయి యౌ సత్పదవిన్
గొనకొని దయచేసెదవని
యనుగద నిగమములు వేం. 6

అనుదినము వేడుచుంటిని
విను మొండొక దైవ మెందు వెదకిన లేదం
టిని వింటిని విన లేదని
యనుమంటిని బలుకు వేం. 7

రారాదా మముఁ గనుగొని
పోరాదా భక్తనమితిఁ బ్రోచుట కభయం
బీరాదా కృప లేదా
యారా కానిమ్ము వేం. 8

కరినరసి బ్రోచితని యెడి
గురుతరమగు నీదుకీర్తి కో యని పొగడన్
దురితముల నడఁచి కృప న
న్నరయఁగ రక్షింపు వేం. 9

ఘనుఁడ వనుచు నిను వేఁడిన
వినుచు దయామృతసువృష్టి వెల్లివిరియఁ జే
సినగాక ఘనత గలదా
యనుపమగుణజాల వేం. 10

సిరిగలిగిన దనవారలఁ
గరమురసి యనుగ్రహింపఁగావలె గాకీ
తెరగున నుపేక్ష తగునా
యరుదాయె నిదేమి వేం. 11

కుధరం బెత్తుటకంటెను
బృథుగతి శిలదన్నుకంటె పృథ్వి గ్గిటిలీ
లధరించుటకంటెను భర
మధికమె కృపఁగనుట వేం. 12

వెన్నుఁడవు నీవు నిజమని
యన్నానే కాని గొల్లయతివల నిండ్ల
న్వెన్నలు ముచ్చిలితని ని
న్నన్నానా నేను వేం. 13

వాదించెదఁ గృపగనుమని
మోదించెద నీచరిత్రములువిన దయస
పాదించెద నుతుల సదా
హ్లాదాహత ఖేద వేం. 15

పరిభవమున ద్రౌపది ని
న్నరుదుగ నెదఁదలఁప నక్షయాంబరములు చే
కురె గురువరుసభగల తన
యరులాశ్చర్యపడ వేం. 16

భరపడియెడి దానసము
ద్ధరణము నీబిరుదెయూను దార్క్షణం బా
శరిబోర్చెచు నిర్దయ నీ
శరయఁగ మును లేదు వేం. 1

వినుతచరిత్రుఁడవే యని
యనుదినము నుతింతుఁగాని యాభీరవధూ
జనవసనహారివని ని
న్ననఁగలనా నేను వేం. 17

నీకై వ్రతోపవాసము
లేకాంతఃకరణవృత్తి నేఁ జేసితి నీ
రాక వడిఁ గోరుచును సుగు
ణాకర కరుణింపు వేం. 18

పాకరిపువినుత శ్రితజన
లోకాంచిత పారిజాత లోకేశ దయా
లోక వినుతింతు నిను సుగు
ణాకర దయఁ జూడు వేం. 19

ధరణిపుల వేడ నత్యా
దరమున బెరట్టె వతములఁ దలఁచి నుతింప
స్థిరుణాదలిర్పఁగఁ ద్వరలో
నరయుము నీవాఁడ వేం. 29

పరమోపకారివని నీ
చరితలు ప్రకటించుఁగాని చయ్యన వినుమా
గురుతుగను దయను బ్రోచుట
హరిహరాయనుతచరణ వేం. 21

ఏతన్మాత్రుఁడవా ప్రి
ఖ్యాతిం జగములను గావఁగా వెలసితివో
శీతోష్ణకరవిలోచన
యూతురత యిఁకేల వేం. 22

పలుదెఱఁగులనిను బిలిచితి
దలఁచితి నెమ్మదిని హృదయతామరసమునన్
నిలిపితిని కేమిజేసెద
నలఘుగుణాభరణ వేం. 23

భారము నీయదియని నే
సారమతి న్నుతులొనర్తుఁ జయ్యనదయతో
క్షీరముననో నీరముననో
యీరసినను ముంపు వేం. 24

భారమనక క్రోధారుణ
ధారాదృక్సమితివెలయఁ దతమదిరిపు సం
హారాపిచార నూనవి
హారివి గావయ్య వేం. 25

భండనమున దర్వీకర
కాండము రవిసుతుఁడు నేయఁగాఁ దచ్ఛరమా
ఖండలసుతు దునుమమి నీ
యండయె కాదయ్య వేం. 26

పాండురవర్ణుఁడు సుమకో
దండవిపక్షుఁడు దిశావితతివసనుఁడు బ్ర
హ్మాండోదరుఁ డీశుఁడు నీ
యండనె మదిఁగోరు వేం. 27

సకలాశాధిప విలస
న్మకుటాంచత్పదతరాగ మాణిక్యవిభా
ప్రకటీకృత పదయుగళా
అకలంకా వరద వేం. 28

నీకళ్యాణ గుణంబు ల
నేకంబులు నేనుతింప నేర్తునె త్రిదశా
నీకంబు జాలదనఁగ వి
భాకర శశినేత్ర వేం. 29

పూతన విషవక్షోజము
పోతమవని నీవుఁ గుడువఁబూనిన నసువు
ల్వాతఁగొని యీవె యెగ్గస
కాతత మోక్షంబు వేం. 30

గొల్లఁడనఁగ నెగడిననడి
తల్లినిగనుగప్పి పరుల దధినవనీతం
బెల్లెడలఁ గొంటివనియెడి
యల్లరి పోదయ్య వేం. 31

మృదువచనంబులఁ గర్కశు
హృదయము పేశలత నొందునే యాదిధునీ
పద మెత్తఁగి నీ వెదయఁగను
మదయత వే విడువు వేం. 32

ఒప్పరయఁగ నాదిని నీ
వప్పులఁ బడియుంటదెలిసె నాశ్రితులిఁక ని
న్నప్పుకొన నేమియనఁగద
వప్పా కరుణించి వేం. 33

వరగోవర్ధన మెత్తుట
నెరుఁగమె పాలకునుతాల నెత్తుటయె పురం
దరుఁ గెల్చి యాదవుల మే
లరయుటకై కాదు వేం. 34

గురినిలిపి నీపదాబ్జము
లిరవుగఁ బూజించువారి కిహమున ధనగో
తురగేభ దానదాసిక
లరుదా పరమొదవు వేం. 35

కరుణారసధారను నా
దురితాగ్నులనడఁచి ప్రేమతోఁ బ్రోవు సు
స్థిరముగ నీవాఁడను సు
మ్మరికాననదహన వేం. 36

ఆరయ గామోర్వర నీ
కారుణ్యకటాక్షవృష్టి గలిగినయెడ ము
క్త్యాఖ్యఫలించుట యరుదా
యారసి దయఁజూడు వేం. 37

దినకరుని చేత దుహినము
ధనమున దారిద్ర్యవితతి తరలినయటు నీ
వినుతకథాశ్రవణముచే
ననయం బఘమడఁగు వేం. 38

దయగల దేవుఁడవని నే
భయభక్తులఁ బిలుతు చక్రపాణీ యనుచు
న్నయమార్గమాన పలుకమి
యయయో వింతాయె వేం 39

పలుగాకిని కఠినుఁడ ని
శ్చలచిత్తుఁడగాను భక్తిజాడలెఱుఁగ ద
ప్పులువట్టక దయతోఁగను
మలఘుగుణాభరణ వేం. 40

నీకళ్యాణ గుణంబుల
నేకంబులు నేనుతింప నేర్తునె త్రిదశా
నీకంబు జాలదనఁగ వి
భాకర శశినేత్ర వేం. 29

పూతన విషవక్షోజము
పోతమవని నీకుఁ గుడుపఁబూనిన నసువు
ల్వాతఁగొని యీవె యొగ్గస
కాతత మోక్షంబు వేం. 30

గొల్లఁడనఁగ నెగడినసడి
తల్లినిగనుగప్పి పరుల దధినవనీతం
బెల్లెడలఁ గొంటివనియెడి
యల్లరి పోదయ్య వేం. 31

మృదువచనంబులఁ గర్కశ
హృదయము పేశలత నొందునే యాదిధుతీ
పదమెఱిఁగి నీవెదయఁగను
మదయత వే విడువు వేం. 32

ఒప్పరయఁగ నాదిని నీ
వప్పులఁ బడియుంటదెలిసె నాశ్రితులిఁక ని
న్నప్పుకొన నేమియనఁగద
వప్పా కరుణించి వేం. 33

వరగోవర్ధన మెత్తుట
నెరుఁగమె పాలకునుఱాల నెత్తుటయె పురం
దరుఁగెల్చి యాదవుల మే
లరయుటకై కాదు వేం. 34

గురినిలిపి నీపదాబ్జము
లిరవుగఁబూజించువారి కిహమునధనగో
తురగేభ దానదాసిక
లరుదా పరమొదవు వేం. 35

కరుణారసధారను నా
దురితాగ్నులనడఁచి ప్రేమతోఁబ్రోవు సు
స్థిరముగ నీవాఁడను సు
మ్మరికాననదహన వేం. 36

ఆరయ గామోర్వర నీ
కారుణ్యకటాక్షవృష్టి గలిగినయెడ ము
కాఙ్క్షఫలించుట యరుదా
యారసి దయఁజూడు వేం. 37

దినకరునిచేత దుహినము
ధనమున దారిద్ర్యవితతి తరలినయటు నీ
వినుతకథాశ్రవణముచే
ననయం బఘమడఁగు వేం. 38

దయగల దేవుఁడవని నే
భయభక్తులఁ బిలుతు చక్రపాణీ యనుచు
న్నయమార్గమౌనె పలుకమి
యయయో వింతాయె వేం 39

పలుగాకిని కఠినుఁడ ని
శ్చలచిత్తుఁడగాను భక్తిజాడలెఱుఁగ ద
ప్పులువట్టక దయతోఁగను
మలఘుగుణాభరణ వేం. 40

భయమైనను నీపాద
ద్వయ మెదఁగీలించి కేశవాయని నుడువన్
జయమగు నెల్లరకును హరి
హాయ వినుతచరిత్ర వేం. 41

చందనముల దినకుబ్జకు
సుందరతర రూపమొసఁగి సూనాస్త్రక్రియన్
బొందుగఁ దేల్చితివని ని
న్నెందురు బుధజనులు వేం. 42

ముదముగఁ గాలయవను ముచి
కుందునిచే బొలియఁజేసి కోరినపదవిన్
బొందించి మించితని ని
న్నందురు కోవిదులు వేం. 43

అంబుజములు రవిహిమకర
బింబము నుత్పలచయంబు బీదజనము వి
త్తంబుంబలె నినునేని
త్యంబును గోరెదను వేం. 44

భవ్యుఁడవు యోగిజనతా
సేవ్యుఁడవు విరించి చంద్రశేఖర ముఖసం
భావ్యుఁడవు దివ్యుఁడవు నిజ
మవ్యయుఁడవు నీవు వేం 45

కలలోన నిన్ను నెఱుఁగని
మలినాత్మకుఁడా పదనురమాధవ యనుచున్
దలఁచిన గుణమెన్నకనీ
పలరుచి రక్షింతు వేం. 46

పలికించు వాఁడవీవే
పలికెడు వాఁడవునునీవె పరమాత్మభవ
ద్విలసన గుణములు నుడివెద
నలరుచు దయఁజూడు వేం. 47

సులభుఁడవును దుర్లభుఁడవు
తెలిసినమెడఁ దెలియకున్నది విజులకైనం
బలిభంజన కరిరంజన
యలఘు గుణాభరణ వేం. 48

రమ్మంటినో తెమ్మంటినో
సమ్మతిభవరోగ ముడుపఁజాలెద వభయం
బిమ్మంటి నీకిదియసా
ధ్యమ్మా కాదంటి వేం. 49

ఘనపాంచజన్యమును నీ
వనువుగ ధరియించి వైరియడరులడఁగఁగా
మునుకొని మొరయింపుముని
న్ననుదినము నుతింతు వేం. 50

బంధురకోపాన్వితరిపు
బృందభూభ్రమణ వల్లకిగ్రిపమ్రంబా
నందకము నందిమదిప్రి
లందఱ మన్నించిదింపు వేం. 51

త్వరను సుదర్శననామక
పరిపంథిక్రూర దానవప్రాణసదా
చరఫణిచక్రముగొని రిపు
హరణము గావింపు వేం. 52

కామాద్రివైరి షట్కము
ప్రేమించుచు నున్నదిపుడు పడనడువుమునీ
కౌమోదకీ గదాహతి
నామోదముతోడ వేం. 53

సికౌస్తుభ రత్నంబును
వైకుంఠుని హృదయనాసి వైయనురాగ
శ్రీకిం గుదురైతివని సుగు
ణాకర వినుతింతు వేం. 54

కరిరాజ వరదవిష్ణూ
గరుడధ్వజచక్ర పాణికంసవిరోధీ
మురహార కేశవ మాధవ
హరికృష్ణ ముకుంద వేం. 55

అజగరదానవ వధనగు
నిజతేజోమహిమ జూచినిను నరుఁడనఁగా
వ్రిజజనములో దలఁచిరి
యజుఁడవనుచుఁ గృష్ణ వేం. 56

స్ఫురదురు తావకపాదాం
బురుహద్వయ మెదనునిలిపి పూజించితివే
మరుమానసి కముగాఁబుర
హరవినుత చరిత్ర వేం. 57

వరదుఁడవని నద్భక్తిని
గరిమొరలిడ మకరిశిరము ఖండించిభవ
త్కరుణను నిరుపుర మనుచుట
యరుదా మోఁగదయ్యా వేం. 63

సోమకుఁడు సకలవేద
స్తోమముహరియించి జలధిఁజొచ్చినవానిన్
వే మడియించితి మీనవు
వై మహిమ నెలంగ వేం. 59

సురలును దనుజులు జలనిధి
దరువఁగ మందరముగ్రుంగు తరికూర్మమవై
భర మూనిసురలఁ బ్రోచితి
వరి దానవులడఁగ వేం. 60

కనకాక్షుఁడు నినువెదకెద
ననుకొని వసుమతినిజుట్ట నాతనికిటివై
కినుక నడఁచితాల్చితివే
మనఁగల కుతలంబు వేం. 61

డింభకుఁ బ్రహ్లాదుని శ్రమ
దంభి హిరణ్యకశిపుఁడను దైత్యునడఁపఁగా
స్తంభమున దోఁచునరహరి
యంభోజదళాక్ష వేం. 62

కురుచవగుచు బలిని(త్రిపద
ధరణీదానంబుగోరి దానవ సంప
ద్ధరణము జేయుచు మించితి
వరయఁద్రివిక్రమత వేం. 63

ఇరువదియొక పరి భూపుల
నరుకుచు శ్రీపరశురామ నామమున ధరా
మరులకివసి యొసఁగతివో
హరిపద్మదళాక్ష వేం. 64

హరువిల్లువిరచి భూమిజ
పరిణయుఁడవై పంక్తిగళుని బరిమార్చిన పాం
డుర కీర్తివి శ్రీరామా
హరవర్ణితనామ వేం. 65.

బలియుఁడు బలరాముఁడు నా
వెలసిసుధాశన విరోధివిదళనమున భా
సిలి రేవతివరియించిన
హలధర గోత్రధర వేం. 66.

పురదానవ హరణార్థము
గిరిశునకు న్తోడుపడుట కీర్తిదమని ఖే
చరులు మొరవెట్టబోద్ధత
నరయ వహించితివి వేం. 67.

ఖలులధికుల గుచునచలా
వలయము వెస నాక్రమింప వారినడఁపఁగా
నిలకల్కివికాఁబోయెద
వలఘుమతినవ్వరద వేం. 68.

ధరణిజనియించి కంసా
ద్యరులనుహరియించి మించియాభీర స్త్రీ
ల రతులఁ దేల్చినకృష్ణా
హరపంకజనాభ వేం. 69.

దక్షావిల సత్కౌస్తుభ
వక్షా శకటాఖ్య దైత్యవారణ నవహా
ర్యక్షాత్రిత శర్వముఖా
ధ్యక్షా రిపుశిక్ష వేం. 70.

ధీరాముని జనహృదయ వి
హారావిధి రుద్రవందితాఖిల సుగుణో
దారా రాత్రించర సం
హారా సువిచార వేం. 71

శ్రీదాపురుహూతార్చిత
పాదావతభక్తలోక బంధుర కలుష
చ్ఛేదానిఖిల త్రిదశా
హ్లాదాహతభేద వేం. 72

ఈశారాతిత్రించరగళ
నాశాపోషిత గజేంద్ర నవ్యాంబుదసం
కాశాగుణపూరిత సక
లాశాలక్ష్మీశ వేం. 73

సీతాతరుణీ నేతా
వాతాశనవిభ శివాభివందితగుణ సం
ఘాతా శుచికీర్తి ప్ర
ఖ్యాతానిర్ణేత వేం. 74

రంగాకల్పిత తార్క్ష్యతు
రంగాసత్యాంతరంగ రాజత్కరుణా
పాంగా నత సురపతి స
ర్వాంగా రిపుభంగ వేం. 75

మాయలను మానిదయతోఁ
జేయంగల పనులనెల్లఁ జేయుము నేనుం
గాయికిఁ దెల్పిననీపై
న్యాయమరోపించు వేం. 76

పెద్దవని వేడఁగను నా
వద్దకురావైతి రోటనినువడిఁగట్ట
న్మద్దులను జేరి ప్రోచితి
పెద్దర నీగుణము వేం. 77

నీవే దేవుఁడ వనుచును
నీవేరక్షకుఁడవనుచు నిక్కంబనుచు
న్నే వింటినిన్ను వినుతుని
యావల మఱిగలరె వేం. 78

అమలిన పదపంకేజ
భ్రమరీకృతయోగి వరవిరాజిత చిత్తా
సముచిత కరుణోదాత్తా
యమితగుణాయత్త వేం. 79

దశదిగ్విలాసినీశ్రుతి
విశదీకృత నైజ కీర్తివిస్మిత వల్లీ
కిసలామాంబుజ భసలా
యసదృశ ధృత్యచల వేం. 80

నేనునిను నమ్మిభక్తిని
దైనందినపూజ సలిపితడబడక ‘‘యని
త్యానిశరీరాణి’’ యనుచు
ధ్యానింతును గావు వేం. 81

తినలేదా బలుసాకని
నిను నేనన నిజముబల్క నిష్ఠురమనుచున్
వినినావెడ దోసము లే
దని కనికరముంచు వేం. 82

వలపున గోపాంగనలను
బలుమరు మరుకేళిదేల్చి వలసిననాతిన్
జలమూనిముసుగుఁ గోయుట
యలవాటా! నీకు వేం. 83

కలవనిసకలాగమములు
తెలుపునుఘోషించి నిజముతేటపడఁగ నీ
యెదుగైనఁ గనులఁజూడక
యలవగు నానమ్మ వేం. 84

వగవాని సోదరునకీ
వగణితసామ్రాజ్య మిచ్చితనుచును నినునే
మొగమోటము పెట్టెదనని
యగపడ వెటులోదు వేం. 85

దీనార్థి కల్పభూజా
భానుసహస్రైకతేజ భవవిముఖ స
మానితసుగుణ సమాజా
యానత సురరాజ వేం. 86

కారుణ్యమూని వాంఛిత
మే రీతినొసంగినతము నేలెదవా సదా
చారా కౌస్తుభవిలస
ద్ధారా నగధీర వేం. 87

కరుణానముద్రుఁడవు నీ
చరణములను గొలుచు భక్తజనముల కోర్కెల్
త్వరలోఁ జేకుఱుటరుదా
యరుదా నానుడువు వేం. 88

నిర్మల చిత్తుండై యే
కర్మంబుల నేని నరుఁడు కంజాక్ష నిను
న్మర్మంబు లేక తలఁచిన
నర్మిలి రక్షింతు వేం. 89

కుక్షిస్థసకల భువనా
పక్షిప్రభుగమన దనుజవన్యవిదహనా
చక్షుఃశ్రుతీశ శయనా
అక్షివిజిత నలిన వేం. 90

భరమేమి గరుఁడొకరుఁడు
కరువలిసుతుఁ డొకఁడు గలుగఁగా విచ్చేయన్
సరిరమ్ము తెలిసెనంగతి
యరమర లేకమాను వేం. 91

మటుమాయ సేయునీపద
తటినీజీవనము నిఖిలదా సాఘములన్
యెటు సేయ లేవునీవిఁక
నటమటఁ బెట్టకుము వేం. 92

దుష్టుల శిక్షించెదవని
శిష్టుల రక్షింతునను చుఁ జెప్పఁగ నేలా
స్పష్టముగ మ్రోసెనిగమము
లష్టదిశాంతముల వేం. 93

రావా యీనా భక్తుల
సేవలుగొని మేము మున్నుఁ జేసిన సుకృతి
న్దేవరకు బుద్ధరూపమ
హా వెలసెను గాక వేం. 94

దురితతమో భాస్కరుఁడవు
శరణాగత వత్సలుఁడవు శాశ్వతుఁడవు నీ
కొఱకు వినుతింపవలదా
హరికరుణాల వారి వేం. 95

పగ లేదు నీకునాయెడ
తగవునుదప్పవు సభక్తి తాత్పర్యముతో
మిగులనినుఁ జూడవేడిన
నగపడ వేమయ్య వేం. 96

సంకల్ప మాత్రమున నీ
పంకజ గర్భాండవితతి ప్రభవించుఁగదా
కింకరుని బ్రోచుచో నీ
కంకిలి యేమయ్య వేం. 97

దుగ్ధాబ్ధి శయన వనద
స్నిగ్ధమహా త్తర శక్రరసిత నలినాక్షా
దగ్ధాఖిల కిల్బిష స
మృద్ధ్యగ్ర్యత్త హిమాద్రి వేం. 98

గర్భస్థాబ్జ భవాండా
నిర్భాగ్యా సురనిశిత సీమాగ్రాండా
నిర్భిన్నకలుష ప్రహ్లా
దార్భక పరితోష వేం. 99

పెద్దనిను నమ్మునారి వి
పద్దశ యెప్పుడునుజేరఁ బొల్పగమినిదా
సద్గుణఁగి పోవుపటగద
యద్దిర నీమహిమ వేం. 100

# అముద్రితాంధ్ర గ్రంథ సర్వస్వము.—

చెలికాని లచ్చారావుగారు,

(సంపాదకులు.)



| | |
|---|---|
| జాహ్నవీమాహాత్మ్యము (ఏనుఁగు లక్ష్మణకవి) | 0-10-0 |
| సీమంతినీకళ్యాణము (పెనుమళ్ళ సోమన్నకవి) | 0-10-0 |
| విజయనందనవిలాసము (మంగళగిరి ఆనందకవి) | 0-10-0 |
| వాల్మీకిచరిత్రము (రఘునాథ భూపాలుఁడు) | 0- 8-0 |
| రంగనాథ రామాయణము (కాచభూపతి, విఠ్ఠలరాజు) | 1-0-0 |
| శ్రీరంగమాహాత్మ్యము (కట్టా వరదరాజేంద్రకవి) | 0-12-0 |
| సారంగధరచరిత్రము (కూచిమంచి తిమ్మకవి) | 0- 8-0 |
| మదనగోపాలశతకము. | 0- 2-0 |
| మహిబాహుమనోహరశతకము. | 0- 2-0 |
| వేంకటాచలనిలయశతకము. | 0- 1-0 |
| నమశ్శివాయశతకము. | 0- 1-0 |
| చిత్రాడ వేంకటేశ్వరశతకము (సంస్కృతము) | 0- 2-0 |

వలయువారు, కార్యదర్శి:—

అముద్రితాంధ్ర గ్రంథసర్వస్వము,

చిత్రాడ; పిఠాపురంపోస్టు, గోదావరిజిల్లా.

## — శ్రీ రామవిలాసగ్రంథమాలిక —

### నవలలు.

| | | |
|---|---|---|
| 1. ప్రభాతము. | ... | రు 0—12— |
| 2. వినోదిని (ప్రథమభా) | ... | 0—12— |
| 3. వినోదిని (రెండవభా) | ... | 0—12— |
| 4. ప్రేమలత. | ... | 0—8— |
| 5. పరుసవేది. | ... | 0—8— |
| 6. మయసభ | ... | 0—10— |
| 7. అపూర్వప్రతిభ. | ... | 0—10— |
| 8. కాంచనమాల. | ... | 0—3— |
| 9. రోహిణి. | ... | 0—2— |
| 10. రత్నపురి. | ... | 0—2— |
| 11. మాయ. | ... | 0—6— |
| 12. చాందసుల్తాన. | ... | 0—10— |
| 13. పాణిగ్రహణము. | ... | 0—1— |
| 14. సహృదయ. | ... | 0—4— |
| 15. చినరంగరావు | ... | 0—6— |
| 16. హంసకా చరిత్రము | ... | 0—8— |

### ఇతరగ్రంథములు.

| | | |
|---|---|---|
| 17. బదిరీతులు. | ... | 0—4— |
| 18. స్త్రీనీతిపద్యరత్నావళి | ... | 0—4— |
| 19. రాయలరాజనీతి. | ... | 0—4— |
| 20. ఐరోపామహాసంగ్రామము | ... | 0—2— |
| 21. తురంగము. | ... | 0—1— |
| 22. గోపా. | ... | 0—8— |
| 23. మల్లెమొగ్గ | ... | 0—1— |
| 24. నాయకులకర్తవ్యము. | ... | 0—8— |
| 25. ఆంధ్రపరిశోధక మహామండలిచరిత్ర & ముద్రితాముద్రితగ్రంథములపట్టిక. | | 0—8— |

వలయువారు, మానేజరు;— శ్రీ రామవిలాస ప్రెస్,
చిత్రాడ, పిఠాపురంపోస్టు, గోదావరిజి